# ప్రహ్లాదుని భక్తితత్త్వము-
## పోతన, ఎఱ్ఱనల తులనాత్మక పరిశీలనము

రచయిత :
డా॥ మరింగంటి లక్ష్మణాచార్యులు
ఎం.ఏ., పిహెచ్.డి.,

1991

# ప్రహ్లాదుని భక్తితత్త్వము-
# పోతన, ఎఱ్ఱనల తులనాత్మక పరిశీలనము


ర చ యి త :

**డా॥ మఱింగంటి లక్ష్మణాచార్యులు**

ఎం.ఏ., పిహెచ్:డి.,



**1991**

ప్రహ్లాదుని భక్తితత్త్వము - పోతన ఎఱ్ఱనల తులనాత్మక పరిశీలనము

రచయిత : డా॥ మరింగంటి లక్ష్మణాచార్యులు

తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో
ఈ పుస్తకము ప్రచురింపబడినది.

ప్రథమ ముద్రణ : ఏప్రియల్ 1991

కాపీలు : 1000

వెల: రూ.30

పుస్తకములు దొరకు చోటు :
**పద్మశ్రీ**
ప్లాట్ నెం. 118, సూర్యసరోజ్,
ఇంజనీర్ సిండికేట్,
హుడా కాంప్లెక్స్, సరూర్‌నగర్.
హైదరాబాద్ - 500 035

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 380.
ఫోన్ : 68418

# అంకితం

దుష్ట శిక్షణా, శిష్ట రక్షణలు ధ్యేయంగా తలచి,
నమ్మి కొలచిన వారికి అండ దండగా నిలచి,
ఆర్తితో, ప్రపత్తితో పిలచినవారికి
ఐహికాముష్మిక సుఖములు ప్రసాదిస్తున్న
**లక్ష్మీసమేత శ్రీ యాదగిరి నృసింహస్వామి వారికి,**
శత, సహస్ర ప్రణామాలతో.........
'లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్'

—శంకర భగవత్పాదులు

భృత్యస్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!

—కులశేఖరాళ్వార్

**—మ. లక్ష్మణాచార్యులు**

# ముందు మాట

ప్రాతః స్మరణీయులైన భక్త శిఖామణులలో ప్రహ్లాదుడు ముఖ్యుడు. ప్రహ్లాదుడు తల్లి గర్భమున ఉండగనే భక్తి తత్త్వమును వంటబట్టించుకొనినాడు. బాలుడైననూ, పరమ భాగవతోత్తముని గుణములను పుణికి పుచ్చుకొని, మెలకువ లోనూ, నిద్రలోనూ, ఆ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడును, అవాఙ్మానస గోచరుడును, ఆర్తత్రాణ పరాయణుడును, అణువణువులో వ్యాపించి ఉన్న వాడునూ అయిన శ్రీమన్నారాయణుని ధ్యానించి, సేవించి, తరించి, తన వారందరినీ తరింపచేసినాడు. ఆతని చరిత్ర ముముక్షువులకు ఒక దీపస్తంభము వంటిది. పరమాత్మ 'ఇందుగల డందులేడని సందేహము వలదు' అని చాటిచెప్పి, శ్రీమన్నారాయణుని చరణారవిందములకు ప్రపత్తి చేసినవారికి 'పునర్జన్మ నవిద్యతే' అని చాటిచెప్పినవాడు ప్రహ్లాదుడు. శ్రీహరి కరుణా కటాక్ష వీక్షణ ములు పొందుటే మన లక్ష్యము కావలెనని చెప్పి, దానిని తన చేతలలో చూపిన ఆదర్శభక్తుడు ప్రహ్లాదుడు.

తెలుగు కవులలో విశిష్టస్థానము సంపాదించుకొన్న మహాకవులు బమ్మెర పోతన, ఎఱ్ఱాప్రెగడలు. వీరిరువురూ తమ. తమ ప్రతిభా వ్యుత్పత్తులు, రచనా పటిమ, కల్పనాచాతుర్యము మరియు భక్తిప్రపత్తుల ఆధారంగా వేర్వేరు పద్ధతు లలో ప్రహ్లాదుని చరిత్ర పొందుపరచినారు. భక్తి తత్త్వమును ప్రతిపాదించిన వారివురి రచనా విధానములను, భావ సౌందర్యమును తులనాత్మక దృష్టిలో పరిశీలించి ఈ గ్రంథములో వ్రాయుట జరిగినది.

ఇది నేను వ్రాసితిని అనుటకన్న శ్రీ లక్ష్మీనృసింహ స్వామియే. తన అవ్యాజమాన కటాక్షముతో వ్రాయింప చేసినాడు—అనుట ఉపయుక్తమూ, వాస్తవము కూడ అని చెప్పవచ్చును.

ఆధ్యాత్మికతా, భక్తి తత్త్వమూ రోజు రోజుకూ క్షీణించుచూ, ఐహిక సుఖముల మీద, పాశ్చాత్య జీవన విధానముల మీదా ఆకర్షణా, కాంక్ష ప్రబల

పోతున్న ఈ రోజులలో, ప్రహ్లాదుని చరిత్ర చదువుట, దానిని కొంచెమైనను ఆచరించుట ప్రతి హిందూ బాలుని కర్తవ్యము. తమ పిల్లలకు ప్రహ్లాదుడూ, ధృవుడూ, నచికేతుడు వంటి వారి గురించి తెలియజేయుట వారిని సక్రమ మార్గములో నడుపుట తల్లిదండ్రుల మరియు గురువుల కనీస బాధ్యత. ఇటు వంటి పుస్తకములు ప్రచురించు నిమిత్తము, ఆర్థిక సహాయము చేయుచున్న తిరుమల తిరుపతి దేవస్థానముల వారు ఎంతైననూ అభినందనీయులూ, అభివంద నీయులు కూడ. ఇది ప్రైవేట్ సంస్థలకు కూడా ప్రేరణ కావలెనని, తద్వారా మరెన్నో గ్రంథములు వెలుగులోకి వచ్చి, హిందూ ధర్మము యొక్క ప్రాశస్త్యమును, మన ఆదర్శ పురాణ పురుషుల జీవితములను, ఉత్కృష్టమైన అలనాటి జీవన విధానములను అందంగా, ఆకర్షణీయంగా, సులభంగా, అందరికీ అందు బాటులో ఉండునటుల చేయవలెనని రచయిత ఆశ, ఆకాంక్ష,

పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయ మొనరించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి మరొక్కమారు కృతజ్ఞతలు.

ఇట్లు
భక్తాంఘ్రిరేణువు
**మ. లక్ష్మణాచార్యులు**

# ప్రహ్లాదుని భక్తితత్త్వము : ఎఱ్ఱన, పోతనల తులనాత్మక పరిశీలనము

## భాగవతము – భక్తి

సనాతన భారతీయ సారస్వతంలో వేద వేదాంగములు, ఉపనిషత్తులు, పంచమ వేదమైన భారతము ప్రాచీనములైతే, భాగవతం అర్వాచీన శాఖ. భాగవతం వేదవాఙ్మయంలో అంతర్భాగం. ఇది సుస్పష్టంగా ప్రతిపాదించే ఆస్తికత్వం, అవతారతత్త్వం, భక్తియోగం బీజప్రాయంగా వేద సారస్వతంలో ఉన్నట్టివే. భాగవతానికి అంతరాత్మ భక్తి. ఈ గ్రంథం భక్తి వేదాంత తత్త్వానికి పరాకాష్ఠ ప్రతిపాదించు సాహిత్య శిఖరం. భక్తి వేదాంత తత్త్వ క్రమ పరిణామ వికాసం వేద వాఙ్మయంలో సూక్ష్మ దృష్టితో అనుశీలించేవారికి భాగవతం సుగమమే.

పోతన భాగవతమును నిగముగా, ఆమ్నాయముగా అభివర్ణించినారు–

నిగమములు వేయి చదివిన
సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా! (భాగ. ప్రథ. 140)

అంతేకాదు, ఈ భాగవతము భువన క్షేమకరమైనది. భారతకర్త, భాగవత ప్రవక్త వేద వ్యాసమహర్షియే. భారతం ఏ వేదాంత తత్త్వానికి భరత వాక్యం పలికిందో, భాగవతం ఆ వేదాంత తత్త్వానికే నాంది గీతిక ఆలాపించినట్లు చెప్పవచ్చు. భాగవతంలోని ఇతివృత్తాలకు కేంద్రం అవతార మూర్తియైన శ్రీకృష్ణుడూ ఆయన పూర్వావతారాలు అని మనకు తెలుస్తుంది. చిత్తశాంతికి భాగవత పఠనం సులభోపాయం. 'సద్యోముక్తి ప్రదాయకమై, శీఘ్ర శరణాగతి'యైన భాగవతం 'సర్వ వేదేతిహాసంగా' సంస్కృత భాగవతంలోనే ప్రస్ఫుటంగా చెప్పబడింది.

శ్లో॥ ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితం।
ఉత్తమ శ్లోక చరితం చకార భగవానృషిః॥
సర్వం వేదేతిహాసానాం సారంసారం సముద్ధృతమ్।
సతు సంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్॥
(భాగ. 1 స్కం. 40-42)

భాగవతం సాక్షాత్తూ కల్పవృక్షం. భక్తులపాలిటి కొంగుబంగారం. జ్ఞానము విడిచి భక్తిలేదు. భక్తి విడిచి జ్ఞానయోగము లేదు. భాగవతము ఈ విషయాన్నే నిరూపిస్తుంది భక్తియోగమే జీవన్ముక్తి యని, భాగవతశ్రవణము వనే ముక్తి సులభమగునని కూడా మనకు విదితమౌతుంది.

భారతీయ సర్వమత సిద్ధాంతాలకూ, దర్శనపథాలకూ, ఉపాస్యరీతులకూ, జీవనవిధానాలకూ అద్భుతంగా సమన్వయం సాధించిన మహాగ్రంథం వ్యాస భాగవతం మానవ జీవన దీపమైన ఈ గ్రంథం, ఇది-అది అనిగాక సమగ్ర సాహిత్యస్వరూపమని, భక్తి సిద్ధాంత ప్రతిపాదకమని, ముముక్షువులకు మార్గ దర్శకమని చెప్పవచ్చును.

సచ్చిదానందమగు నిర్గుణ పరబ్రహ్మము సత్త్వ, రజ స్తమో గుణములు పొంది, సగుణమై, త్రిమూర్తులుగా పరిణమించి, సృష్టి, స్థితి, లయములను నిర్వ హించునని వేదాంతదర్శనము. భాగవతములో శ్రీ విష్ణుని యవతార లీలలును, తద్భక్తి మార్గములును, మెండుగా నిండుగా వర్ణించబడి యున్నవి. వీని మూల మున విశుద్ధమనస్కులు, భక్తులు అయినవారికి నిర్గుణ పరతత్త్వ జ్ఞానము సాక్షాత్కరింప జేసి మోక్షమును కరతలామలకము చేయుట భాగవత లక్ష్యము.

'భగవతి భక్తాః భాగవతాః, తేషామిదం తత్త్వం భాగవతం' - భగ వంతుని యందు భక్తులగువారు భాగవతులు. వారి జీవితమందు పొందుపరచ బడినది గాన ఇది భాగవతము. భక్తులు తమ ఉపాస్య దైవము యెడల శ్రద్ధ, ఆరాధన, అర్చన, శరణాగతి భావనలతో కూడిన ప్రేమను ప్రదర్శించి, 'ఫలాభి సంధి రహితమగు' సాత్త్విక, నిస్స్వార్థ ప్రపత్తిని వ్యక్తపరచెదరు. అటువంటి భక్తులలో అతి విశిష్టమైన స్థానము కలగి ఉన్నవాడు ప్రహ్లాదుడు.

ప్రహ్లాద, అంబరీషాదులు సాత్త్విక భక్తులు, హిరణ్యకశిపు ఒంసాదులు రాజస భక్తులు మరియు గజేంద్రాదులు తామస భక్తులు. భక్తిలో దాసభక్తి, మధురభక్తి అను రెండు విధములు. ప్రహ్లాద, అంబరీషులు దాసభక్తులైతే, గోపికలు మధుర భక్తిని నమ్మి తరించినవారు. వైష్ణవ సంప్రదాయములో ఆళ్వారులు, గోదాదేవి తమను నాయికల వలెను, శ్రీమన్నారాయణుని నాయకుని వలెనూ భావించి, సేవించి తరించారు. మహాభక్తుడూ, వాగ్గేయకారుడూ అయిన అన్నమాచార్యుడు కూడ 'తిరువేంకటపతి'ని నాయకునిగా, తనను నాయికగా కల్పన చేసి వేలకొలది కీర్తనలు వ్రాసినాడు—

హరి హరీయనుచు, పరమ పతివ్రతా భావంబు బూని
హరి ముకుందు గొనియాడు నా జిహ్వ"......

* * *

## ప్రహ్లాదుడు - విశిష్టత

తల్లి గర్భమున ఉన్నప్పుడే నారద మహర్షి ద్వారా హరి గుణగణాల్ని, అనంత మహిమలనూ, అద్భుత శక్తి సామర్థ్యాలనూ, ఆర్తత్రాణ పరాయణతనూ విని, భూమిపై పడి కన్ను తెరచినదాదిగా, శైశవ, బాల్య, యౌవన, ప్రౌఢ, వార్ధక్య దశలలోనూ, చివరకు అంతిమ ఘడియల వరకునూ, ఆ హరిని మనసా, వాచా, కర్మణా స్తుతించి, తాను తరించుటయేగాక తన కులము నంతనూ తరింప జేసినవాడు ప్రహ్లాదుడు.

ప్రపంచంలో కొందరు తమ తల్లిదండ్రుల ఆస్తిపాస్తుల లేదా కీర్తి ప్రతిష్ఠల సహాయముతో పేరు పొందుతారు. కొందరు ఆకస్మిక సంఘటనల వల్ల, అదృష్టవశాత్తూ గొప్పవారిగా తలచబడతారు. కొందరు ఇతరుల అజ్ఞానమును, అమాయకతనూ, దౌర్బల్యాలను, బలహీనతలను ఉపయోగించుకొని గొప్పవారౌతారు. కాని తన పురాకృత సుకృతము వలన స్వయంప్రతిభా పాటవము, మృదు మధుర సంభాషణము, ఆదర్శవంతమైన నడవడిక, అద్భుతమైన వ్యక్తిత్వముల ద్వారా తనకే కాదు, తనను గన్న తల్లిదండ్రులకూ, తాను జన్మించిన వంశానికి అజరామరమైన కీర్తిప్రతిష్ఠలు సంపాదించి పెట్టినవాడు ప్రహ్లాదుడు.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్......

అను శ్లోకములో ఒక చమత్కారమున్నది. ప్రహ్లాదుడు తల్లి గర్భములో ఉన్నప్పుడు, నారదమహర్షి నారాయణ మహిమల్ని వినిపించినాడు. ఆ విధముగా నారదుడు ప్రహ్లాదునికి గురువైనాడు. అయిననూ పై శ్లోకములో గురువైన నారదుని కన్న ప్రహ్లాదునికే ప్రథమస్థానం ఇవ్వబడినది. శ్రీమన్నారాయణుని యెడల అచంచల నిస్వార్థ భక్తి, సత్ప్రవర్తన, సాత్త్విక భావనలు ప్రహ్లాదుని గురువుని మించిన శిష్యునిగా చేసినవి. సార్థక నామధేయుడైన ప్రహ్లాదుడు ఈ కారణముగనే పరమ భాగవతోత్తమునిగా గుర్తించబడినాడు.

అనన్యాః చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం... (భగవద్గీత)

అని 'మాట' ఇచ్చిన ఆ శ్రీహరిని...

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ...అంటూ తన సర్వస్వాన్ని ఆ పరమాత్మకు అర్పించుకొని, ధన్యత నొందినాడు ప్రహ్లాదుడు.

సర్వాంతర్యామియగు పరమేశ్వరుని నిరంతరమూ చూచుచూ, స్మరించుచూ, అనుభవించుచూ, పరవశమున జడునివలె వర్తించి, దేహమునకు కలిగిన సుఖదుఃఖములకు లోబడక సాత్త్విక భక్తికి ఉదాహరణంగా నిలిచినవాడు ప్రహ్లాదుడు.

"అడుగడుగునా మాధవుని చింతనా సుధా మాధుర్యముతో మేను మరచుచూ, బ్రహ్మాదులు అభ్యసించలేని హరిభక్తికి పుంభావమైన వాడు, మాతృగర్భము జొచ్చినది మొదలు తన చిత్తమును అచ్యుతుని మీదనే లగ్నము చేసినవాడు, అఖిలప్రపంచము విష్ణుమయమని నమ్మినవాడు, వినయ, కారుణ్య, బుద్ధి వివేకాది లక్షణములకు ఆటపట్టైనవాడు ఈ ప్రహ్లాదుడు.

ప్రాతఃస్మరణీయుడైన ప్రహ్లాదుని చరిత్రను తమ అద్భుతమైన కావ్య ప్రతిభతో సర్వజనరంజకముగా చేసిన మహాకవులు ఎఱ్ఱాప్రగడ, పోతనామాత్యులు. ఎఱ్ఱాప్రెగడ కవిత్రయములో ఒకడు కాగా, పోతనామాత్యుడు తరువాత ప్రభవించిన కవిమూర్తులలో విశిష్టస్థానము పొందినవాడు.

**ఎఱ్ఱన :** ఎఱ్ఱనకు ఎఱ్ఱయ లేదా ఎఱ్ఱాప్రెగడ అని కూడ పేరు కలదు. ఈయన ఊరు పాకనాటిలో గుడ్లూరు. తల్లిదండ్రులు పోతమ్మ, సూరన్నలు. శ్రీవత్స గోత్రోద్భవుడూ, అపస్తంభ సూత్రుడూ అయిన ఈ కవి శివభాగవతుడు. క్రీ. శ. 1320-1340 సం॥ కాలమునాటి వాడైన ఈయన గురువు శ్రీ శంకర స్వామి. 'శంభుదాసుడై'నను ఇతడు విష్ణు విద్వేషి కాడు. 'కవిత్వము చెప్పుట ఈయనకు వెన్నతో పెట్టిన విద్య. ప్రబంధ పరమేశ్వరుడని, శంభుదాసుడని, సకల భాషా కవిత్వ విశారదుడని ప్రశంసింపబడిన ఈయనలో సౌజన్యము, వినమ్రత, సౌమ్యత, ధర్మానురక్తి, దైవభక్తి దండిగా ఉన్నవి. విద్యాబల మెంతగానో ఉన్ననూ వినయమున కాళిదాసునే మించిన వాడని ఈ క్రింది వాక్యము మనకు తెలియచెప్పుచున్నది

వ కతిపయాక్షర పరిగ్రహ జనితం బయిన నైసర్గిక చాపలంబు కతంబున" (లక్ష్మి - 1-12)

అంతియే కాదు...

తాను నమ్మిన దైవానికి దుష్టునిగాలియైనా తగులనీయక పీవన విసరుతూ, ఆ దైవానికే రక్షణ కల్పించగోరువాడు-

ఉ. ఎక్కడిదెద్దు, భూతియును నెమ్ములు సొమ్ములు, భిక్ష జీవనం
బొక్కటి కట్ట, జీరయును, నుండగ నిల్లును లేదు నిక్కువం
బిక్కఅకుం దపస్వి జను నేచిన నయ్యెడు నేమియంచు దా
నొక్కని శర్వునిం బఱుపనొల్లడు దైత్యుడనాదరంబునన్.

(లక్ష్మి 2-124)

ఈయన గురుభజన పరాయణుడు....వినయోదయ భరితుడూ అని (లక్ష్మి...1.18 పీఠిక) ధర్మైకతత్పరుడు...శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్త చిత్తుడని (అరణ్య...7-469) మనకు స్పష్టమౌతుంది.

పాకనాటి శాసనములబట్టి క్రీ శ. 1300 ప్రాంతాల్లో ఉన్న రెడ్డిరాజు లలో ప్రముఖుడూ, రెడ్డిరాజ్య స్థాపకుడూ అయిన ప్రోలయ వేమారెడ్డి, ప్రతాప రుద్రుని ప్రభుత్వ కాలమున ఒక సేనానాయకుడు. ఆయన సోదరుడు మల్లారెడ్డి. ఈ మల్లారెడ్డి ఆదరాభిమానములను పొందిన వాడు ఎఱ్ఱన, ఇతని

ప్రతిభాపాండిత్యములు ఎందరితోనో ప్రశంసింపబడినవి. వీటివలననే నన్నయ్య తిక్కనలతో సరిసమానుడై భారత అరణ్య పర్వశేషమునేగాక హరి వంశమును గూడ సమర్థతతో నిర్వహించి కవిత్రయములో స్థానమును పొందగలిగినాడు. ఇత డారణ్య పర్వశేషమును నన్నయ పేరుమీదనే తెనిగించి రాజరాజునకే అంకితము చేసినాడు. దీనివలన ఆతనిలోని సహజమైన వినయ విధేయతలు, నన్నయ యెడల గల భక్తి ప్రకటితమౌచున్నవి. అరణ్య పర్వములోని శేషమును నన్నయ శైలితో నారంభించి, తిక్కన శైలితో ముగించినందున రెండు మహా సముద్రములను కలిపెడి 'జలసంధి' అని పిలవబడినాడు.

అరణ్య పర్వము నందలి ఘోషయాత్ర, రామోపాఖ్యానము, సావిత్ర్యుపాఖ్యానము, యక్షప్రశ్నలు అను భాగములు మిక్కిలి పేరుపొందినవి. అరణ్య పర్వశేషమున ఎఱ్ఱన రామాయణమును గూడా రచించి తన ప్రభువైన ప్రోలయ వేమారెడ్డికి అంకితమిచ్చెను. కాని మన దురదృష్టము అది ఇప్పుడు లభ్యమగుట లేదు. ఇతని శైలి అనితరసాధ్యమైనది. హరివంశము ఈ కవియొక్క మరొక ఉత్కృష్ట రచన. ఇందలి శైలి పరిపక్వమైనదని పలువురి అభిప్రాయము. శ్రీకృష్ణుని చరిత్ర వర్ణనతో పాటు ఇందులో జానపద జీవన పద్ధతులను కడు రమ్యముగా వర్ణించినాడు. సాత్త్విక శృంగారము ఈ కవి చేతిలో మెరుగులు దిద్దుకున్నది. రుక్మిణీ కల్యాణము, ఉషానిరుద్ధుల చరిత్రము మొదలగు ఘట్టములు ఎంతో హృద్యముగా వర్ణించబడినవి. అనువాదముకూడా ఎంతో మనోహరముగా, ఒక్కొక్కవేళ మూలమునకే అందముతెచ్చు విధముగనుండి, కవి ప్రతిభను వ్యక్తపరుచును. ఈ కవి స్వతంత్రరచన లక్ష్మీనృసింహ పురాణము. ప్రహ్లాదచరితము ఇందులోనిదే. బ్రహ్మాండ పురాణమునుండి వస్తువును గ్రహించి, అక్కడక్కడ మార్పులు, చేర్పులు, చేసి, చక్కని వర్ణనలతో ఒక అద్భుతమైన కావ్యముగా చేసినాడు ఎఱ్ఱన. ఈ కవి భక్తిని వర్ణించుటలో క్రొత్త రీతు లవలంబించినాడని చెప్పవచ్చును. పోతనవలె భక్తి పరాకాష్ఠను వర్ణించ లేకపోయినను, అతని కన్న తక్కువ అని చెప్పుట వీలుపడదు. ఈ కవి శైలి సత్త్వ శుద్ధికి నెలవై, సత్త్వ ప్రధానమైన ఈయన శీలమునకు ఆదర్శములై మనకు అనిపించును. ఎఱ్ఱన సూక్తి వైచిత్రి శ్రీనాథ కవి సార్వభౌముని వంటి వారలచే ప్రశంసింప బడినది. ప్రోలయ వేమారెడ్డి అభిమానమును పొందగిన ఎఱ్ఱన తాను విరచించిన రామాయణమును

ఆయనకే అంకితమిచ్చినాడు. భావానుకూలమైన, గ్రాంథిక, వ్యావహారిక భాషా మేళనను, అద్భుత శైలిని, అనితర సాధ్యమైన సూక్తి వైచిత్రిని, పలుకు బళ్ళను, సామెతలను మనము ఎఱ్ఱన రచనలలో దర్శించగలము. సాహితీ ప్రియులకు, రసికులకు, ముముక్షువులకు, పండిత పామరులకు, తన రచన ద్వారా ఆనందామృతము పంచిన మహాకవి ఎఱ్ఱన. తన కాలము నాటి సామాజిక ధార్మిక, రాజకీయ పరిస్థితుల్ని తన రచనలలో ప్రత్యక్షముగానూ, పరోక్షముగా కూడ ప్రతిబింబింపచేసినాడు. ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ ఫల పురుషార్థముల ప్రాముఖ్యాన్ని, మానవ జీవితములో వాటికిగల స్థానాన్ని యెడ నెడ వర్ణించి, జీవిత పరమార్థాన్ని ఎఱుకపరచినాడు ఈ మహాకవి. శైవ, వైష్ణవ మతముల మధ్య ఆనాడు నెలకొని ఉన్న వైషమ్యాలను తొలగించు లక్ష్యముతో హరిహర అభేదత్వాన్ని కూడా నిరూపించిన ఘట్టములున్నాయి. తాను స్వయముగా శివ పూజా ధురంధరుడై, శైవాగమనిష్ణాతుడై, శంభు దాసుడను బిరుదము కల్గి ఉన్ననూ నృసింహ పురాణమును అద్భుత రీతిలో, అనితర సాధ్యముగా రచించాడు. అందువలననే 'కవిత్రయము'లో స్థానము సంపాదించుకొని, తెలుగు సాహిత్య గగనంలో ఒక జాజ్వల్యమాన తారగా భాసిల్లినాడు. ఆయనను పొందిన తెలుగు మాత ధన్యచరిత.

## పోతన :

తెలుగుల పుణ్యపేటి, తెలుగు భావనల పుణ్యపుంజమూ అయిన బమ్మెర పోతనామాత్యుడు గొప్ప కవితా యోగి. తెలుగువారి జీవితాన్ని అమృతవాహినిగా ప్రవహింపజేసిన కారణజన్ముడు మహా భక్తుడూ, కవిశిరోమణీ అయిన ఈ మహాత్ముని రచనలను పొందుట తెలుగు సాహితీ ప్రియుల పూర్వజన్మతపః ఫలమేగాని వేరొండుగాదు. ఈయన శ్రీనాథుని సమకాలికుడూ బంధువూ యని కొందరి సమ్మకము క్రీ. శ.. 1400 - 1450 కాలమువాడైన పోతనామాత్యుడు భోగినీ దండకము, వీరభద్ర విజయము మరియు శ్రీమదాంధ్ర మహా భాగవత మును రచించెను. ఇందలి మొదటి రెండు రచనలు ఆయన యవ్వన కాలమున రచింపబడినవై యుండవచ్చును. మహా భాగవతము ఆయన ప్రతిభా వ్యుత్పత్తులకు, భావశబలతకు, భాషాగరిమకు, అననుకరణీయమైన శైలికి, అద్భుతమైన రీతులకు, కల్పనలకు, వ్యాకరణ విషయములకు. అమలిన శృంగా

రానికి, వైరాగ్య బోధనలకు, తత్త్వ నిరూపణకు, ఆత్మజ్ఞాన నిరూపణకు, భక్తి నిర్వచనానికి ఉపయుక్తమైన విలక్షణ ఉదాహరణం. విశ్వజనీనత, సార్వకాలికతలను సంతరించుకున్న శ్రీ భాగవతం విభిన్న మత సిద్ధాంతములలోని ఏకత్వాన్ని, జీవన విధానాలలో సమన్వయిస్తూ, భక్తి, రక్తి, ముక్తులను ప్రాప్తింపజేసి, తరతరాలవారికినీ తగిన రీతిలో అందించింది. అందువలననే ఈ గ్రంథం ఆంధ్ర వాఙ్మయమునకు అనర్ఘ్యరత్నహారమువలె ప్రకాశము నిచ్చి, సౌందర్యమును ద్విగుణీకృతమొనర్చినది. పోతనశైలి మధుర మంజులమై, పాఠకులను మైమరపించును. భాగవతములోని వస్తువు అలౌకికమై, రసమయమై, ఆత్మోజ్జీవమునకు హేతువైనదగుటచే ఆ గ్రంథము, గ్రంథకర్త అమరత్వము పొందినారు. 'ఆ బాలగోపాలాన్ని' అలరించిన ఆ 'బాలగోపాలు'ని లీలల్ని, మహిమల్ని మనముందు కళ్ళకు కట్టినట్టుగా వర్ణించిన పోతన మహాకవి, కేవలము తెలుగువాడే కాదు, యావద్భారత జాతి గర్వించదగ్గవాడు. వ్యాసుని భాగవతాన్ని ఆంధ్రీకరించువేళ పోతన కవిత్రయమువారి పద్ధతినే అవలంబించినాడు. ముఖ్యముగా ప్రహ్లాద చరిత్రము నందు ఎట్టి ప్రభావము మనకు ప్రత్యక్షముగానూ, పరోక్షముగాను కన్పించును. కాని ఈతడు సహజముగా భక్తుడగుటచే భక్తుల చరిత్రములను వర్ణించునప్పుడును, భక్తి తత్త్వాదులను వివరించునప్పుడును ఆవేశపరుడై గ్రంథమును మూలముకంటె విస్తృత తరము కావించెను. భాగవతములో వర్ణించబడిన మహావిష్ణువు ఇరువదియొక్క అవతారములను, దుష్టశిక్షణ, శిష్టరక్షణ విధానములను, శ్రీకృష్ణుని బాల్య క్రీడాదులను పోతన హృదయ రంజకముగా, ప్రభావోత్పాదకముగ వర్ణించినాడు. తన ఆత్మను ఇందు ప్రవేశపెట్టి, ఆయన గీత కావ్యముగా మలచినాడని చెప్పవచ్చును. పోతన వర్ణనలు ఆ వర్ణ్యమును పాఠకులకు సాక్షాత్కరింపజేయును. తెలుగు భాషకు నిసర్గమైన సంగీత మాధుర్యము లీతని కావ్యమున మనకు పెక్కుచోట్ల కనిపించును. పోతనకు అలంకార ప్రయోగమన్న చాల ఇష్టము. అంత్యానుప్రాసమన్న మరీ ఇష్టము. ఈయన కవిత్వమున, ఈ కారణముచేతనే మృదంగ ధ్వన్యనుగతమయిన మృదుల సంగీతము మనకు వినిపించును.

'వాక్యం రసాత్మకం కావ్యమ్' - రసభరితములైన వాక్యములున్నదే కావ్యము. హితముతో గూడినది సహితము. దాని భావము సాహిత్యము. సాహిత్యమున కానందప్రదానమే పరమోద్దేశ్యమైనను, అది ఉపదేశప్రధానమై

ఉన్న పక్షమున అది మరింత రాణించి, లోక ప్రసిద్ధి నొందును. భాగవతము, భారతము మొదలైన గ్రంథములు ఒక్క భారతీయులకే గాక ఎల్ల దేశము లందలి, ఎల్ల మానవులకు అన్వయించుటకు ఇదియే కారణము. మనసుకు, ఆత్మకు నెమ్మదిని చేకూర్చి, 'బ్రహ్మానంద సహోదర' మనదగు అద్భుతమైన స్థితిని అందించెడివే ఉత్తమ కావ్యములు. తాత్కాలికోద్రేకమును, ఆవేశ ఆనందములను కలిగించి, పథభ్రష్టులను చేయక ఐహికాముష్మిక సుఖములను అందించు ఉద్దేశ్యముతో ఎందరో మహాకవులు ఇటువంటి ఉత్తమ రచనలు చేసినారు. అటువంటివారి కోవకు చెందినవారే ఎఱ్ఱాప్రెగడ, పోతనలు

ఎఱ్ఱన, పోతనలకు నడుమ కాల వ్యత్యాసము కూడ ఎంతో ఉన్నది. ఎఱ్ఱన క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వభాగము వాడైన, పోతన 14 వ శతాబ్ది తరువాతి వాడు ఇరువురిలోనూ భక్తి పారవశ్యత, భావనాపటిమ, శబ్ద-సంపత్తి, అభివ్యంజనాశక్తి, సామాజిక శ్రేయస్సు యెడల శ్రద్ధ, వినయవిధేయతలు, వ్యక్తిత్వములో వైలక్షణ్యము. ధార్మికబుద్ధి, ఆధ్యాత్మిక చింతన, గురుభక్తి, ఈశ్వరుని సర్వ వ్యాపకత్వమునందు దృఢమైన నమ్మకము, సర్వమానవ సౌభ్రాతృత్వము, శాంతికాముకత, సమస్త ప్రాణికోటి ఎడల సహృదయ పూర్వక సమభావన, అహింసా భావన, దయార్ద్రత, శాంతి సామరస్యాదులు సమానముగా ఉన్నవి అనే చెప్పవచ్చును. కాని, వీరిరువురి రచనా విధానములో, వర్ణనలలో, శబ్దముల ప్రయోగములలో అభివ్యక్తి రీతులలో, అలంకారములలో, ఛందోరీతులలో, ఎత్తుగడలలో, వస్తు ప్రతిపాదనలో వ్యత్యాసమును మనము గమనించవచ్చును. ఇరువురూ భాగవతాభిమానులే, నిష్ఠాగరిష్ఠులే. శైవాగమ నిష్ణాతులే, అవిరళ జపహోమ తత్పరులే, విద్యా వినయ సంపన్నులే. కాని తమ తమ దేశ, కాలమాన పరిస్థితులతో ప్రభావితులై రచనలు సాగించిన మహానుభావులు. పోతనలో ఎఱ్ఱన కంటే స్వాభిమానము, ఆత్మగౌరవము, వ్యక్తి స్వాతంత్ర్యాభిలాష మనకు ఎక్కువగా కన్పించును. సహజకవి, భక్త శిరోమణి పోతన దారిద్ర్యములో పుట్టి. దారిద్ర్యములో పెరిగి, దారిద్ర్యములో జీవించినా, ఆ దారిద్ర్యమును ఏమాత్రము లెక్కచేయక దామోదరుని సేవకే తన తనువు, మనసూ అర్పించి, తన కావ్యమును కూడా భగవదార్పణ చేసిన విశిష్టవ్యక్తి. ఎఱ్ఱన జీవితములో పోతన కంటె తక్కువగనే ఆర్థికపరమైన ఒత్తిడులున్నవని మనకు దొరికిన ఆధారములను బట్టి చెప్పవచ్చును. ప్రోలయ

వేమారెడ్డి అపారాభిమానముతో ఆయన జీవితము సాఫీగా జరిగినదనవచ్చును అయినను లౌకిక ఆకర్షణలకు, ప్రభువుల అధికార దండమునకు, సుఖ విలాసముల తళుకు బెళుకులకు లొంగక, పారమార్థిక చింతనతో జీవితమును గడిపిన భక్తజీవులు ఎర్రన, పోతనలు. ఎర్రన కూడ జన్మతః కవి. భావుకత అతని విశేషము. అతని కవితాశయ్య పుష్పగుంఫితము. హృదయము రస ప్రస్రవణము. ఎన్నో విషయములలో పోతన్నకు అన్న అని ఋజువు చేసుకున్నాడు ఎర్రన.

## ప్రహ్లాద చరిత్ర

భాగవతములోని రసవంతమైన కథలలో ప్రహ్లాద చరిత్ర ఒకటి. మహాకవి పోతన ఈ ఘట్టమును 270 పద్యములలో వర్ణించినాడు. భాగవతమునకు, పోతనా రచనాశక్తికి వన్నె తెచ్చిన ఘట్టములలో ప్రహ్లాదచరిత్ర ముఖ్యమైనది. ఏ కోణములో పరిశీలించినను ఈ ఘట్టములో ఉత్కృష్టత, సౌశీల్యత, పారవశ్యత, మాధుర్యము మనకు గోచరించును. రచనా సంవిధానము, శయ్యా విశేషమును బట్టి, అష్టమ స్కంధము ముందు సప్తమ స్కంధము తరువాత రచింపబడినవని చెప్పవచ్చును.

'గజేంద్ర మోక్షము, వామనావతార ఘట్టములలో గల అంత్యప్రాసల సొగసు, వృత్త్యనుప్రాసల బిగువు, కల్పనలలో మనోజ్ఞతగాని అంతగా ఈ స్కంధములో (సప్తమ స్కంధము) కనిపించవు.' (పోతన - భాగవత రచన శిల్పం లక్ష్మీపతి శాస్త్రి.)

పై కథనాన్ని బట్టి అష్టమ, దశమ స్కంధములలో ఉన్న పరిపక్వత, రచనా పటిమ ప్రహ్లాదచరిత్ర పొందుపరచబడియున్న సప్తమ స్కంధములో అంతగాలేదని తెలియుచున్నది.

భాగవతములోని సప్తమ స్కంధములో ప్రహ్లాద చరిత్రము 116 వ పద్యమునుండి ప్రారంభమగును. హిరణ్యకశిపునకు విచిత్ర చరిత్రులగు నలువురు పుత్రులు కలరు. అందు ప్రహ్లాదుడు ఒకడు

ఎఱ్ఱాప్రెగడ విరచితమైన లక్ష్మీనరసింహావతారమను పురాణకథలోని తృతీయాశ్వాసములోని 137 వ పద్యమునుండి ప్రహ్లాద జననము, ఇత్యాదులు వర్ణింపబడినవి. ఎఱ్ఱాప్రెగడ, హిరణ్యకశిపునకు నల్గురు పుత్రులున్నట్లు ఎచ్చటనూ లిఖించలేదు.

ఎఱ్ఱన, పోతన లిరువురూ సీసపద్యముతోనే ప్రహ్లాద చరిత్రమును ప్రారంభించుట ఒక విశేషము.

ఎఱ్ఱన, నృసింహావతార సంస్తవ సరణిని, బ్రహ్మాండాది పురాణాలలో ఉన్న విషయాలను తీసుకొని ఐదు ఆశ్వాసములలో వర్ణించినాడు. నృసింహపురాణములో మొత్తము 804 గద్య, పద్యములు కలవు. పన్నెండు పద్యములలో సముద్ర వర్ణన, పదమూడు పద్యములలో వైకుంఠ వర్ణన, ఆరు పద్యములలో నగరి వర్ణన, ఐదు పద్యములలో బ్రాహ్మణాధిక్య ప్రశంస, పదకొండు గద్య పద్యములలో హిరణ్యకశిపుని తపోవర్ణన, పదహారు పద్యములలో వసంత వర్ణన, ఐదు పద్యములలో పుష్పాపచయం, ఐదు పద్యములలో అచ్చరల ఆట పాటలు, ఐదు గద్య పద్యములలో రాజనీతి, ఇరవై ఏడు పద్యములలో మునుల వినతి, ఇరవై పద్యములలో వెన్నెల, వేసవుల వర్ణన, పది పద్యములలో మధుపాన వర్ణన, ఆరు పద్యములలో లీలావతీ గర్భలావణ్య వర్ణన చేసిన తదుపరి ఇరువది మూడు పద్యములలో ప్రహ్లాద చరిత్రమును పొందుపరిచాడు.

నిజానికి, బ్రహ్మాండ పురాణములో నుండి గ్రహించిన కథ చాలా అల్పమ్ము. విష్ణు పురాణము నుండి గూడ కొంత గ్రహింపబడిన ఈ కథను ఎఱ్ఱన తన ప్రతిభా వ్యుత్పత్తులతో, కల్పనా పటిమతో, రచనా శక్తితో విస్తృతము చేసినాడు.

సంస్కృత భాగవతానికి తెలుగు భాగవతం కేవలం యథాక్షరానువాదం కాదు; యథోచితానుసరణం అని చెప్పవచ్చు. ఎన్నోచోట్ల పోతన మూలాన్ని పెంచి వ్రాశాడు. ప్రహ్లాద చరిత్ర రచనా సంవిధానమునకు సంస్కృత భాగవతముతోబాటు దానికి శ్రీధరుడు వ్రాసిన వ్యాఖ్యానం కూడా ఆధారంగా తీసుకొని ఉన్నాడు.

హిరణ్యకశిపుని దురాగతములు మిన్ను ముట్టినవి. అతల, వితల, సుతల, తలాతల, రసాతల, పాతాళ లోకాదులతోబాటు స్వర్గము కూడ అతని దుశ్చేష్టలకు గడగడ వణకి పోయినది. దేవ, మానవ, యక్ష, కిన్నర, కింపురుష, గంధర్వాదులు పోయి విష్ణువును మొరపెట్టుకున్నారు. 'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం' అన్నారు. 'పాహి .....పాహి...... ఆర్తత్రాణ పరాయణా!' అని హాహాకారాలు చేసారు. అప్పుడు......

ఎఱ్ఱనగారి శ్రీమహావిష్ణువు—

సీ. [illegible] భంగి పంచానన సమరేఖ
    [illegible]లాంగమును బురుషానుకారి
  [illegible] నఖంబులు తీవ్ర శస్త్రంబులు
    [illegible]ముఖము ఘనశౌర్యవేళ
  [illegible] రిపునకు వధశీల
    [illegible]మధ్య భేదనము గదన
  [illegible] సర్వావాస నిగ్రహ
    [illegible] విజయ ప్రమోద లీల

ఆ. [illegible]ద్భుత స్ఫూర్తి నెసకమెసగ
  [illegible] నరసింహ భవ్యదివ్యావతార
  [illegible] పరిణమింతు దడవులే దింక నాత్మ
  [illegible] నిర్వృతు దేవతాగణములార!

(నృసిం.తృతీ. 54 స.)

అని చెప్పడం ద్వారా తన రానున్న నృసింహావతారమును ముందే సూచించాడు. కాని పోతన్న గారి శ్రీహరి......

శా. [illegible] నొందెదు దయ్య నిర్జరవరుల్! భద్రంబు మీకయ్యెడిన్
  [illegible] బాళము భూతసంతతికి, మత్సందర్శన ప్రాప్తి న
  [illegible]మై చేసు: నెఱుంగుదున్ దితిసుత వ్యాపార భాష విప
  [illegible]లీ: గాలము గూడ జంపెద జనుండంరాక మిత్రోవలన్.

* * *

క. కన్న కొడుకు శమదప సం
పన్నుఁడు నిర్వైరుడనక, ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా
పన్నత నొందించు నాడె పట్టి వధింతున్.

(భాగ. సప్త. 110 & 112 ప.)

అని చెప్పి, దేవతల నోదార్చినాడే కాని, తాను హిరణ్యకశిపుని వధించుటకు నృసింహావతారమును ధరింతునని నుడువలేదు. కాని ప్రహ్లాదుని పేరు ముందుగానే చెప్పినాడు.

ఎఱ్ఱన హిరణ్యకశిపుని భార్యపేరు ఎక్కడునూ సూచింపలేదు. కేవలము తదీయ (హిరణ్యకశిపుని) జీవితేశ్వరి, పద్మాక్షి, దైత్యరాజమహిషి, పురంధ్రీ రత్నము, పొలంతి, అబలవంటి పదములనే వాడినాడు. పోతనకూడ కేవలము సప్తమాశ్వాసములోని ఎనిమిదవ అధ్యాయమునందు, ప్రహ్లాదునిద్వారా, అతని మిత్రులకు గతమును చెప్పు సందర్భములో—

మత్తకోకిలము. ప్రల్లదంబున వేల్పులుద్ధతి జాతి రాజనివాసముం
గొల్లవెట్టి సమస్త విత్తము గ్రూరతం గొనిపోవగా
నిల్లునొచ్చి నిశంకుడై యమరేశ్వరుం డదలించి మా
తల్లి దాజెఱబట్టి సిగ్గునదప్పయై విలపింపగాన్

(భాగ. సప్త. 8 అ. 225. ప)

క్వ. ఇట్లు సురేంద్రుడు మా తల్లిం జెఱగొని పోవుచుండ... అని 'తల్లి' శబ్దమునే వాడినాడేగాని, సప్తమస్కంధములో ఆమె పేరును ఒక్క చోట మాత్రము ప్రస్తావించినాడు. (సప్త. 102 ప.) కాని సంస్కృత భాగవతములో ఆమె పేరు 'లీలావతి'గ ప్రస్తావించబడి ఉన్నది. ఎఱ్ఱన, 'లీలావతి' పేరు నుడువులేదు. హిరణ్యకశిపుని భార్య గర్భవతి అయినది. ప్రహ్లాదుని రాకకు ముందుగా శుభసూచకమా అన్నట్లుగా ఆమెకు ఒక చక్కని కల వచ్చినది. దైత్యవంశగురుండైన శుక్రునితో ఆమె...

సీ. ఉపధరింపుము జలదాసిత వర్ణుడు
ఘన శంఖ చక్రలాంఛనాఢ్యుండు
మహిత కోమల వన మాలా సలక్షణ
వక్షుడు, వికసిత వారిజాక్షుఁ
డభినవ పీతాంబరావృత దేహుండు
భూదేవుడొక్కఁ డపూర్వలీలఁ
జనుదెంచిననుఁ జూచి సస్మితవదనుఁడై
తనచేత నొప్పు సంతాన ఫలము

ఆ. నాకు నిచ్చి మున్ను నా మెడనున్న హా
రంబు నిజ నఖాంకురములఁ దిగిచి
కొనుచు వేగ చనియెనని రాత్రి నేఁగల
గంటినపుడు మేలుకొంటి ననఘ. (నృసిం, తృతీ. 128 ప)

అది విని శుక్రుడు...

క. నీ మగని తేజమున ను
ద్దామ శమ సమగ్రుడనగఁ దగి 'కుంపటిలోఁ
దామర 'మొలచిన క్రియఁ' ద
స్వి మునివిభుడైన సుతుడు నీకుదయించున్ (నృసి. తృతీ. 127 ప.)
అని భవిష్యద్వాణి పలికినాడు.

గర్భవతి లీలావతి లావణ్యమును వర్ణించుచు, ఎఱ్ఱన ప్రహ్లాదుని గూడ పరోక్షముగ వర్ణించుచున్నాడు. ఇది పోతన భాగవతములో కనబడదు. అద్భుతమైన పోలికతో మనోరంజమైన శైలితో కూడియున్నదీ పద్యము:

సీ. ఉదరస్థుడగు బాలు నుజ్జ్వల కాంతియ
వెలిఁబార్చెనా మేను వెలరువాఱెఁ
గడుపులో నొప్పారు కొడుకు నిర్మల బుద్ధి
తెలుపనా గనుగవ తెల్లఁబువాఱె
గర్భశోభితుడగు నర్భకు సహజ వి
రక్తినాఁ జవుల యాసక్తి దొరఁగె
లోనున్న సుతుని విలోక విజ్ఞానంబు
ప్రమదనా నాభి వికాసమొందెఁ

గీ. గుక్షిసంగతుడగు పుత్రకుని గుణాలి
మొదలు తెఱఁగున మధ్యంబు పూర్ణమయ్యెఁ
పూర్వ జన్మ సంచిత తపః పుణ్యఫల మ
హోదయంబునఁ జారు పయోజముఖికి. (నృసిం. తృతీ. 181 ప.)

కారణ జన్ముండయిన హరిభక్తుడు ప్రహ్లాదుని లక్షణములన్నియు గర్భవతియైన ఆతని తల్లిమేనిలోనే కన్పించుచున్నవట. అటువంటి బాలుని కనుట కామె ఎన్ని నోములు నోచినదో గదా! ఇది ఆమె పూర్వజన్మ సంచిత తపః పుణ్యఫలమేగాని వేరొకటి ఎట్లగును? లోకమున ఒక సామెత ఉన్నది. 'పువ్వు పుట్టగనే పరిమళించును' అని నానుడి. కాని ఎఱ్ఱనగారు 'కుంపటిలో మొలవబోవు తామర పువ్వు' లక్షణములు, దాని సుగంధము, వైశిష్ట్యము, పుట్టక మునుపే, అనితర సాధ్యమైన రీతిలో, పరోక్షముగ వర్ణించినారు. ఇటువంటి వర్ణన పోతన చేయలేదు.

ప్రహ్లాదుడు జన్మించినాడు...ఆ బాలుని వర్ణన జేయుచు ఎఱ్ఱన మహాకవి—

సీ. అమృతాంబు నిధి సముదంచిత వీచిక
కుదయించు తుహిన మయూఖుడనగ
జారు పురందరాశానితంబిని కుద్భ
వించు సరోజినీ విభుడనంగ
విలసిత రోహణాచల ఖని భూమికి
ప్రభవించు మహనీయ రత్నమనగ
సుందర నూతన మందార లతికకు
జనియించు సురుచిర స్తబకమనగ.

గీ. గాంతియును తేజమును మహార్ఘతయు సౌకు
మార్యమును నభిరామసామగ్రి బొదలఁ
బుత్త్రుఁ డుదయించెఁ దైత్యలోక్యభూతికరుడు
రాజబింబాస్య యగు దైత్యరాజసతికి. (నృసి. తృతీయ. 187 ప.)

దైత్యరాజసతి నోముల పంట, కన్న కలల రూపము, వరాల మూట సాధారణముగ నుండునా! బాలసూర్యుని వలె, అనర్ఘ్యరత్నములె, సుందరమైన మందార కుసుమము వలె, ఓజస్సు, తేజస్సు, సౌకుమార్యము, లావణ్యము, సౌందర్యములతో, త్రిలోకములకు హితమొనర్చు లక్ష్యముతో జనియించినాడట. తన ముద్దులపట్టిని చూచి, తండ్రియైన హిరణ్యకశిపునకు మాత్రము ఆనందము కలుగకుండునా! ఎంత దుష్టుడైననూ, ఎందరి పితృహృదయములను వారి పుత్రులను కడతేర్చుట ద్వారా బ్రద్దలు చేసినను, అతని హృదయములో మాత్రము పుత్రోదయ కారణాన మోదము వెల్లివిరిసినది. ఆ మోదము ఎఱ్ఱన గారి దృష్టిలో ఈ విధముగ నున్నది:

క. పుత్త్రోదయమున నిర్జర
జైత్త్రుడు మునుకొన్న యధిక సమ్మదమున లో
కత్రయ రాజ్యము మును నిర
మిత్రముగా గనిన కంటె మిక్కిలిపొంగెన్. (నృసిం. తృతీ. 115 ప)

ముల్లోకములను జయించినప్పుడు గూడ ఆ 'పెద్దమనిషి'కి ఇంత ఆనందము కలుగలేదట.

'పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడే' కలిగినది కాని 'ముందున్నది ముసళ్ళ పండుగ' అని, ఆ పుత్త్రుడే తనకు ఆగర్భ శత్రువేనని ఊహించలేకపోయినాడేమో!

ఆ బాలుడు ఏల జన్మించెనో దేవ, మానవ, ఋషి, యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషాదులకు ముందే తెలియును గదా! వారు ప్రహ్లాదుని రాకకు ఆమందానంద కందళిత హృదయారవిందులై ___

సీ. పుష్పోపహారము ల్పొలుపార బురమున
గావింపుడను మాట కంటె మొదల
సంగీత వాదిత్ర సాంగత్య భంగులు
గలిగింపుడను మాట కంటె మొదల

నిపుణ విలాసినీ నివహ సంచారంబు
ఘటియింపుడను మాట కంటె మొదల
భూసుర వైజయంతీ సహస్రంబులు
గలిగింపుడను మాట కంటె మొదల

గీ. దివ్య కుసుమ వర్షంబులు దేవ దుందు
భిస్వనంబును నప్సరోభినయగతులు
కల్ప భూరుహాంబర పతాకలు దనర్చె
భువన హిత జన్ముడగు బాలు భూరిమహిమ.

(నృసిం తృతీ. 139 ప.)

లోకాలన్నిటికి మేలొనర్పగా, దుష్టశిక్షణ, శిష్టరక్షణకు నిమిత్తుడై రాక్షస వంశమునకు 'ముసలము' పగిది జనియించిన బాలుని చూసి ఆనందమున దేవతలు దుందుభులు మ్రోగించి పూలవాన కురిపించగా అజ్ఞాని, గర్వి, దురహంకారి అయిన హిరణ్యకశిపుడు ఏమి భావించినాడో ఎఱ్ఱన మాటల్లో వినవలెననిన :

క. అవి యెల్లగని సురద్విషు
డవివేక మనస్కుడగుచు నౌర మదీయో
త్సవమునకు దగ నొనర్చిరి
దివిజులు పనులనుచు దనమదిన్ బ్రియమందెన్.

(నృసి. తృతీ. 140 ప.)

అంతేకాదు, 'బుత్రోత్సవ ప్రమోదమానసుండగుచు, గవి ప్రముఖ భూసుర లోకంబు నతిలోక ధన నివహదానంబుల నానంద హృదయుడై యానందంబు నొందించెనట.'

ప్రహ్లాదుడను పేరుతో, ఆ బాలుడు :

తే. అంబ గర్భంబు వెడలిన యది మొదలుగ
విష్ణుపద కమల ధ్యాన వివశుడగుచు
నసుర రాజ తనూభవు డమృత వృష్టి
దడుపబడు వాడ పోలె వర్ధనము నొందె (నృసిం. తృతీ. 146 ప.)

ఎఱ్ఱనగారు ప్రహ్లాదుని వర్ణించుటలో, అనాటి వరకు కవుల వర్ణనలలో పరంపరగా వచ్చుచున్న వర్ణనలకు భిన్నంగా, నూతన విధముగా నవీన పంథాలో పోకడలు అవలంబించినారనే చెప్పవలెను. అయనకు, ఆ బాలుడు భూమి మీద పడిన మరుక్షణములో చేసిన రోదనధ్వని 'కేర్' 'కేర్' అను శబ్దములు కూడ 'హరీ'! 'హరీ'; అని అనిపించి ఉండుననినచో ఇసుమంతయు నాశ్చర్యము కలుగదు.

బాలుడు దినదిన ప్రవర్ధమానుడై, కళలతో వెలుగుచున్న చందురుని వోలె భాసించుచుండెను.

సీ. పసిపాపడై తాను పవడించు కాలంబు
వట పత్రశయను భావంబు దలఁచుఁ
జలుపొందఁగా బోరగిల శయ్యఁ దడవెడు
తఱిఁగూర్మమూర్తిఁ జిత్తమున నిలుపు
రెండు మూఁడడుగు లొండొండ తట్టాడున
ప్పుడు త్రివిక్రమ లీలఁ బట్టిచూచు
కొంత వెన్నలు బాలు గ్రోలెడు నాఁడు
గోపాల సంస్మృతిఁ గూర్చునాత్మఁ

పరమ పురుషభూత భావిక భవ్యాన
తారబోధ మహిమఁ దక నెఱింగి
యుండడెఱుంగఁ డంబుజోదర ధ్యానత
త్పరత యొకటి కాని బాలకుండు (నృసి. తృతీ. 147 ప.)

వటపత్రశాయిగా, కూర్మావతారునిగా, వామనమూర్తిగా, శ్రీకృష్ణునిగా [illegible] వివిధ దశలలో దర్శించినాడు ఎఱ్ఱన తన మనోనేత్రంతో. ఆ [illegible] శిశువు శ్రీహరి ధ్యానము తక్క వేరొకటి ఎరుగడట. నిరంతర [illegible] సుధారసపానమత్తచిత్తుడు కదా! వేరొండు తలచుట, వినుట, [illegible] చేయుట అసంభవము.

ఇక పోతనగారి ప్రహ్లాదుని పరికింతము:

ఆ. సద్గుణంబు లెల్ల సంఘంబులై వచ్చి
యసుర రాజతనయు నందు నిలచి
పాసి చనవు విష్ణుఁ బాయని విధమున
నేడు దగిలియుండు నిర్మలాత్మ! (భాగ. సప్త. 117 ప.)

సద్గుణముల రాశి, హరి పరతంత్రుడు, తనయందు అఖిల భూతములందు ఒకే విధముగా సమభావనము కలిగిఉండి, పెద్దలకు వినయ విధేయతల భృత్యుని వలె మ్రొక్కుతూ, అన్యకాంతలను మాతృభావముతో చూచుచూ, దీనులయెడ వాత్సల్యభావన కలిగి, సఖులను సోదరులుగా భావించుచూ, గురువును బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ప్రతిమూర్తిగా విశ్వసించుతూ, సత్యసంధుడై, సత్ప్రవర్తనతో ఖులగువాడు ప్రహ్లాదుడు.

సీ. తన యందు నఖిల భూతములందు నొక భంగి
సమహిత తత్త్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్ను దోయికి నన్య కాంత లడ్డంబైన
మాతృ భావము సేసి మరలువాఁడు
తల్లిదండ్రుల భంగి ధర్మ వత్సలను
దీనుల గావఁ జింతించువాఁడు

తే. సఖుల యెడ సోదర స్థితి జరపువాఁడు
దైవతములందు గురువులఁ దలఁచువాఁడు
లీలల యందును బొంకులు లేనివాఁడు
లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప! (భాగ. సప్త, 115 ప.)

అంతేకాదు...ఆ బాలునిలో లౌకిక విషయములందు ఆసక్తి, అరిషడ్వర్గాల విశృంఖలతలు, పంచేంద్రియముల మోహపూరిత ప్రవర్తనలు, వాంఛలు లేవు.

సీ. అకార జన్మ విద్యార్థ వరిష్ఠుఁడై
గర్వ సంస్తంభ సంగతుఁడు గాఁడు
వివిధ మహానేక విషయ సంపన్నుఁడై
పంచేంద్రియములచేఁ బట్టువడఁడు
భవ్య వయోబల ప్రాభవోపేతుఁడై
కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన
వ్యసన సంసక్తి నావంకఁ బోఁడు

ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు
వస్తుదృష్టిఁజేసి వాంఛ యిడఁడు
ధరణినాథ! దైత్య తనయుండు హరిపర
తంత్రుఁడై హతాన్య తంత్రుఁడగుచు. (భాగ. సప్త. 117 ప.)

ఇటువంటి గుణములతో ప్రకాశించెడి ఆ అద్భుత బాలకుణ్ణి ప్రశంసించుట ఎవరి తరము?

క. గుణనిధి యగు ప్రహ్లాదుని
గుణములనేకములు గలవు, గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్ (భాగ. సప్త. 120 ప.)

ఆదిశేషుడు, బృహస్పతి, బ్రహ్మాదులకైనను ప్రహ్లాదుని పొగడుట చేతకాని పని.

ఎఱ్ఱనగారు ప్రహ్లాదుని భక్తి తత్త్వాన్ని, ప్రవర్తనలను ఇలా వర్ణిస్తారు:

ఉ. తొలితొలి యెల్ల పాపములు దొక్కుచు బల్కెడునట్టి తియ్యపుం
బలుకుల నచ్యుతాహ్వయము బల్మరు జేర్కొను వెండి పల్కినం
బలుకగ నంబ లక్ష్మి జగదేక జనిత్రి ముకుంద యంచు న
త్యలఘుతర ప్రబోధ మధురాక్షర వాక్య వివేకదక్షుఁడై
(నృసిం. తృతీయ. 148 ప.)

ఆ బాలకుని నోటి వెంట హరినామమే తక్క వేరొకటి రాదని ఎఱ్ఱనగారి భావన.

వాసుదేవునియందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యాన రతుడైన పోతనగారి ప్రహ్లాదుడు :

సీ. శ్రీవల్లభుడు దన్నుఁ జేరినయట్లైన
 జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు
 వసురారి దన్నెదు నాడిన యట్లైన
 నసుర బాలురతోడ నాడమఱచు
 భక్తవత్సలుఁడు సంభాషించిన యట్లైన
 బరభాషలకు మాఱు పలుక మఱచు
 సురవంద్యు, దనలోన జూచిన యట్లైనఁ
 జొక్కి సమస్తంబుఁ జూడమఱచు

తే. హరిపదాంభోజయుగ చింతనామృతమున
 నంతరంగంబు నిండినట్లైన నతఁడు
 నిత్య పరిపూర్ణుడగుచు నన్నియును మఱచి
 **జడతలేకయు నుండును జడుని భంగి** (భాగ. సప్తమ. 122 ప.)

హరి చింతన అతనిని జడునిగా చేసినది. కాని ఆ జడత 'మొద్దుతనము' లేదా సోమరితనము కాదు. ఆ జడత్వములో నిత్య పరిపూర్ణత, అద్వైత, పారవశ్యత ఉన్నవి. ఎటు చూచినా హరియే. ఆ హరి సర్వ వ్యాపకత్వము సదా తలపోయుచూ, నిరంతర బ్రహ్మానందము ననుభవించు అనిర్వచనీయమైన స్థితి అది.

ఉ. ఆడగబోయినప్పుడ సురాత్మజు "డంబుజనాభు నవ్యయుం
 బాడుద మాదిదేవు పద పంకజ పూజలు సేసి భక్తిమై
 నాడుద మచ్యుతైక శరణాగతులంగని కర్మబంధముల్
 వీడుద" మంచు బల్కగడు విస్మయ మందగఁ దోడి బా...
 (నృసిం. ...)

ప్రహ్లాదుడు తాను అనుభవించుచున్న ఆ సహస్రకోటి సూర్యప్రభా సమానుడైన శ్రీ మహావిష్ణువు చరణారవింద దివ్యామృత స్వాదాన్ని నలుగురికి తెలియజేయవలెనని, తనకు లభించిన ఆనందములో తోటివారిని భాగస్వాములుగ చేయవలెనని, తనతోపాటు వారి కర్మబంధములు కూడ తెగిపోవలెనని, మనసార వాంఛించిన వాడు కావుననే మిత్రులందరిని చేరదీసి, రండు శ్రీహరి ఆటలు ఆడి పాటలు పాడెదమని ఆహ్వానించినాడు.

ఇక, పోతనగారి ప్రహ్లాదుడు తన తోడి బాలకులను ఆటలకు బిలుచుచు:

ఉ. బాలకులార రండు మన ప్రాయపు బాలురు కొంద ఱుర్విపైఁ
గూలుట గంటిరే? గురుడు, క్రూరుఁడనర్థ చయంబునందు దు
ష్కీలిత సర్గ కల్పనము జేసెడి గ్రాహ్యము గాదు శాస్త్రమున్
మేలెఱింగించెదన్ వినిన **మీకు నిరంతర భద్రమయ్యెడిన్.**

(భాగ. సప్త. అధ్యా. 9. 212 ప.)

'నిరంతర భద్రమయ్యేటువంటిది, శాస్త్రముల ద్వారా గ్రాహ్యముకానిది, జన్మ సాఫల్యం బొనరించునది, కైవల్యదాయకమైనది అయిన హరినామము స్మరింతము రండు' అనుచు తనతోబాటు వారందరిని చీకటినుండి వెలుగులోనికి, అసత్తునుండి సత్తునకు, మృత్యువునుండి అమృతత్త్వమునకు నడిపింప నుద్యుక్తుడయ్యెను. "తాచెడ్డ కోతి వనమెల్ల చెరచు" నటువంటి స్వభావము కలవాడు గాదు ఈ ప్రహ్లాదుడు **'ఏకస్స్వాదు న భుంజీతవ్యః'** మను వేదోక్తి ననుసరించి చరించువాడు.

పోతన తొమ్మిదవ అధ్యాయములో ప్రహ్లాదుని ద్వారా అతని స్నేహితులకు సద్వాక్యములు పలికించుచు సదుపదేశములు చేయించినాడు. దాని సారాంశము:

'సకల జన్మములలోకెల్ల మానవజన్మ దుర్లభము. అది కేవలము ధర్మార్థాచరణ కారణంబు. మానవ జీవితము సగము నిద్రలో నిరర్థకమైపోగా, మిగిలిన సమయము శైశవ, బాల్య, యౌవన, ప్రౌఢ, వృద్ధాప్యములలో గడిచిపోవును. శాస్త్రయములతో, భౌతిక వాంఛలతో, బంధుప్రీతితో, ఉదరపోషణార్థమై చేయు వ్యాపారముతో. ధార్మిక చింతనకు, భాగవతసేవకు అవకాశమే లభింపదు,

కావున బాల్యమునుండియే సద్బుద్ధి కలిగి, పరమ భాగవతధర్మము ననుష్ఠించి, జీవితమును సార్థక్యమొనర్చుకోవలెను. వృధా ప్రయాసలతో ఆయువును గడుపక, హరిభజనలో నిరంతరము జీవితయాపన చేయవలెను. ఎందువలన యనగా హరిభజన వలననే మోక్షంబు సిద్ధించును.

ఆ. 'విషయ సక్తులైన విబుధాహితుల తోడి
మనికి వలదు ముక్తి మార్గవాంఛ
నాది దేవు విష్ణు నాశ్రయింపుడు ముక్త
సంగజనులఁ గూడి శైశవమున (భాగ. సప్త. 216 ప.)

ఎపుడో వృద్ధాప్యములో భగవచ్చింతన చేసుకోవచ్చునని, నేడు లౌకిక చింతనలో, విషయవాసనలలో, మునిగి తేలుతూ, చేతులు కాలిన పిదప ఆకులు పట్టుకొనుటకై విఫలయత్నము చేసి చింతించు వారలను ప్రహ్లాదుని ద్వారా పోతన హెచ్చరించుచున్నాడు. రేపేమి కానున్నదో......కాదు...కాదు, మరు క్షణములో ఏమికానున్నదో ఎవరికెరుక! జనన మరణ చక్రము నుండి బయట పడుటకు, ముక్తి సామ్రాజ్యములో నడుగిడుటకు బాల్యము నుండియే గోవింద నామస్మరణ చేయుట అత్యావశ్యకం. అందుకే ఆదిశంకరులు

భజ గోవిందం భజ గోవిందం
గోవిందం భజ మూఢమతే...అని హెచ్చరించి,
పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనం...నుండి తప్పించుకొనవలయున్న నహి నహి రక్షతి డుక్రుఞ్ కరణే...అని నొక్కి వక్కాణించినారు.

మహా భక్తుడయిన శ్రీ కులశేఖరాళ్వారు తన అమర కృతి 'ముకుంద మాల'లో...

'కృష్ణ! త్వదీయ పద పంకజ పంజరాన్త
మద్యైవమే విశతు మానస రాజహంసః
ప్రాణ ప్రయాణ సమయే కఫవాత పిత్తైః
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే?... అని, వృద్ధాప్యములోని చివరి దశలో కలుగు దేహ బాధలలో నీ స్మరణ చేయగలిగెదనో లేదో, ఇప్పుడే, ఈ

స్థిరముగా నుండే. నీ చరణ కమల మనెడు పంజరములో, నా మనస్సనెడి రాజ హంస యుండు విధముగా జేయుమని ప్రార్థన చేసినాడు.

'అసుర భావంబు విడిచి, సర్వభూతంబులందును, దయా సుహృద్భావంబులు' చూపుట ఆవశ్యకంబని ప్రహ్లాదుడు తనతోడి బాలకులకు చెప్పిన వాక్యమును శ్రద్ధతో పరిశీలించిన

అష్టాదశ పురాణాల సారాంశము—

'పరోపకార పుణ్యాయ పాపాయ పరపీడనమ్' అనునది జ్ఞప్తికి రాక మానదు. 'పరోపకారార్థమిదం శరీరమ్' 'అహింసా పరమో ధర్మః'' అను సూక్తులు గూడ ప్రహ్లాదుని ఉపదేశమునందు అంతర్గతముగా భాసించుచున్నవి.

ప్రహ్లాదుని హరినామ స్మరణా విధానమును ఎఱ్ఱన, పోతనలు ఎట్లు వర్ణించిరో పరికించవలెను.

ఎఱ్ఱన :

ఆ. కుడిచినప్పుడు నిద్ర గూర్చిన యప్పుడు
మేలు కొనినయపుడు, మెలగినపుడు
విష్ణు కీర్తనంబు విష్ణు చింతయ కాని
పలుక డొండు బుద్ధిదలపఁ డొండు (నృసిం. తృతీ. 118 ప.)

భుజించు వేళ, నిద్ర కుపక్రమించువేళ, మేల్కొను సమయములో, వ్యవహరించు సమయములో... అది యిది అననేల... అన్ని వేళలయందు [illegible] హరినామ స్మరణ తప్ప వేరొకటి చేయడు. చేసిన, అతడు ప్రహ్లాదుడు కాజాలడు.

పోతన ఇదే భావమును వ్యక్తీకరించుచు—

శా. పానీయంబుల్ ద్రావుచుం గుడుచుచున్, భాషించుచున్, హాస లీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్, లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మరచెన్ సురారిసుతుడే తద్విశ్వమున్ భూవరా!

(భాగ. సప్త. 128 ప.)

పై రెండు పద్యములను పరిశీలించినచో, పోతనగారు తన పద్యము వ్రాయుటకు ముందు ఎఱ్ఱనగారి పద్యమును తప్పక అవలోకించి ఉందురని వూహ కలుగును. ఎఱ్ఱన, పోతనకు ముందువాడగుటచే, ఆయన వ్రాసిన నృసింహ పురాణమును చక్కగా అధ్యయనము చేసి, కొంచెము ప్రభావితుడు గూడ అయి ఉండునని మనము తలచవచ్చును.

జీవిత కాలమంతయు నిస్సారమైన భ్రాంతి మూలకమైన, అశాశ్వత సుఖ ప్రదాయకములైన లౌకిక సుఖములందు వృధా చేసుకొనువారలకు సరియైన మార్గము చూపి కర్తవ్యము నెరింగించి, వారి హృదయాలలో జ్ఞానజ్యోతి వెలిగించుటయే యీ ఇరువురు మహాకవుల లక్ష్యము.

తే. తొలుత 'మూడేండ్లలేని సద్బుద్ధి ముప్ప
దేండ్ల లే'దను నానుడి యిట్టిదనఁగ
దనరెఁ బ్రహ్లాదునకుఁ బ్రౌఢమునులు గోరు
హిత వివేకపాతంబు మూడేండ్లనాడె. (నృసిం. తృతీ. 151 ప.)

ఈ ప్రపంచమున కొందరకు వయస్సు పెరుగును కాని బుద్ధి మాత్రము పెరగదు. పెరుగుదల అటుంచి, వక్రమార్గముల బడిపోవును. విచక్షణాజ్ఞానము, ఉచితానుచిత వివేకము, కర్తవ్యాకర్తవ్య బోధ, సదసద్వివేకము కలుగదు. మూడేళ్ళనాడు లేని సద్బుద్ధి ముప్పదేళ్ళకెటుల వచ్చును? మొక్కై వంగనిది మ్రానై ఎట్లు వంగును? బాల్యములో ఉన్న అజ్ఞానమును 'గోరు'తో తొలగించ వచ్చును కాని, తాత్సారము చేసి, అలసత్వము కారణముగా గొంతుమీదకు వచ్చిన పిదప; గొడ్డలితో పోగొట్టుకొనవలెనను ప్రయత్నము చేసుకొను వారి సంఖ్య ఎక్కువ. అలాంటి వారికి ప్రహ్లాదుని చరిత్ర ఒక ఆదర్శము. ప్రహ్లాదునికి ప్రౌఢమునులు గోరు హిత వివేకము మూడు సంవత్సరములకే అబ్బెనట. అతడెంతటి భాగ్యశాలియో; అతని పురాకృత పుణ్య విశేషమెంత గొప్పదియో; అతనినిగన్న తల్లి ఎంత ధన్య చరితయో; ఆలోచించిన మనకు అవగతమగును.

వైకుంఠ చింతావివర్జిత చేష్టుడై
యొక్కడు నేడుచు, నొక్కచోట
నశ్రాంత హరిభావ నారూఢ చిత్తుడై
యుద్ధతుడై పాడు, నొక్కచోట
విష్ణు డింతయకాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు, నొక్కచోట
నళినాక్షుడను నిధా, నము గంటి నేనని
యుబ్బి గంతులు వైచు, నొక్కచోట

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుడై ని, మీలిత నేత్రుడై
యొక్క చోట నిలిచి యూరకుండు. (భాగ. సప్త 124 ప.)

మహాత్ముల ప్రవర్తన విచిత్రముగా ఉంటుంది నిజమాలోచించిన, మానవులకు గొప్పతనము జ్ఞానముతో సద్వ్యవహారముతో వచ్చునుగాని వయసుతో కాదు. వయోవృద్ధులందరూ జ్ఞానవృద్ధులు కారు, కాలేరు. కొంత పురాకృత విశేష పుణ్యము చేతను, కొంత సత్సాంగత్యము వలనను, కొంత సద్గురువుల వలనను లభించును. మిగతా జ్ఞానము అభ్యాస ప్రయత్నముల వలన లభించును. తాడిచెట్టు, కాకి వంటివి బహుకాలము జీవించునవే! పాపి చిరాయువన్నట్లు ఎంత కాలము జీవించితిమన్నది కాదు - జీవించినది కొద్ది కాలమైనను, ఏ విధముగ జీవితమును గడిపితిమన్నదే ఆలోచన చేయవలసిన విషయము. మహాత్ములు కొలది కాలమే జీవించిననూ, నిస్వార్థ చింతనతో, పారమార్థిక భావనతో ఉందురు. అందులకే వారి ప్రవర్తన లోకుల ప్రవర్తనకు భిన్నముగ ఉండును. నాటి రామకృష్ణ పరమహంస, నిన్నటి మహాత్మాగాంధి, వరకు ఉన్న మహనీయులు ఇటువంటివారే. అటువంటివారి కోవకు చెందినవాడే ప్రహ్లాదుడు.___

అతని రోదన, అతని వేదన ఆ హరికొరకే. అతని ఆటలో, పాటలో, హరి గుణగణ సంధానమే. నిశ్చలముగ నుండిననూ, కంటనీరు క్రమ్మిననూ, పులకిత గాత్రుడైననూ హరి చింతనా ప్రభావము వల్లనే.

కులశేఖరాళ్వారు ప్రవచించినట్లుగా—

దివివా, భువివా మమాస్తు వాసో
నరకేవా నరకాన్తర ప్రకామమ్
అవధీరిత శారదార విన్దౌ
చరణౌ తే మరణేపి చింతయామి...అన్న భావన ప్రహ్లాదునిలో మనకు గోచరమగును.

ప్రహ్లాదునికి ఐదు సంవత్సరములు నిండినవి. తండ్రి హిరణ్యకశిపుడు:

సీ. చౌల మౌంజీ బంధ సంస్కారములు యథా
కాలకల్పితములుగా నొనర్చ
దేశో విశేష సందీప్తుడై యొప్పి య
ప్పాపడు జనకుని పంపువలన
విద్యా పరిగ్రహ వినయదీక్షలకునై
పూజిత గురు గ్రహంబున వసించి
దైత్య దానవ కులోత్తంసంబులగు తన
యీడు బాలురతోడగూడి చదువు

గీ. జదువుచుండ గొంత జనియె గాలం బంత
నొక్కనాడు దండ్రి యుల్ల మలరఁ
గొడుకు చదువు వినగఁగోరి కుమారు నొ
జ్జలను గారవమున బిలువఁబంచె. (నృసి. చతు. 8 ప.)

ఏ వయస్సులో జరుగవలసిన ముచ్చట లా వయస్సుకు జరుగవలెగదా! హిరణ్యకశిపుడు తన కుమారునికి చౌలము, మౌంజీ బంధాది సంస్కారములు చేసి, శుక్రాచార్యుల వారి కుమారుడైన చండామార్కులవారి దగ్గరకు విద్యలు నేర్వమని పంపినాడు. బాలుడైన ప్రహ్లాదుడు తనతోటి బాలురతోటి గూడి గురువుల ఆశ్రమములోనే నివసించుచూ విద్య నేర్వసాగినాడు. కొంత కాలము గడచినది. తండ్రి తనకు గల సహజ కుతూహలమువలన, తన కుమారుడి చదువు ఏ రీతిగ సాగుతున్నదో తెలియగోరి, కుమారుని పిలువ పంపినాడు.

క. చదువని వాడజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత గలుగుం
జదువగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ!
(భాగ. సప్త. 8 అధ్యా. 130 ప.)

విద్య నేర్చుటవలన కలుగు ప్రయోజనములు తెలుపుచూ, చదువులేనిచో అజ్ఞాని యనబడునని, చదువుకొన్నవానికి మంచి చెడుల విచక్షణా జ్ఞానము కలుగు గావున చక్కగా చదువుకోవలయును అని తన కుమారునకు ఉపదేశించు వాడు పోతన్నగారి హిరణ్యకశిపుడు. 'విద్య లేనివాడు వింత పశువు' అనికూడ పోతనగారి ఉద్దేశ్యము.

పోతనగారు ప్రచండ వితర్కులైన, చండా మార్కులకు హిరణ్యకశిపుని ద్వారా ప్రహ్లాదుని అప్పగించినారు. హిరణ్యకశిపుడు గురువులకు తన పుత్రుని అప్పగించుచూ—

శా. అంధ ప్రక్రియ నున్నవాడు, పలుకం డస్మత్ప్రతాప క్రియా
గంధం బించుక లేదు, మీరు గురువుల్, గారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకు పెద్దలు, మముం బాటించి యీ బాలకున్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గావించి రక్షింపరే!
(భాగ. సప్త. అధ్యా. 8. 132 ప.)

తన కుమారుని గూర్చి చెప్పుచూ, అంధుని వలె, మూగవాని వలె ఉన్న వీనికి నా'ప్రతాపము' నెరిగించి, గ్రంథములు చదివించి, నీతి కుశలునిగా చేయమని ప్రార్థించి, మీరు మా గురువులు, కరుణా సముద్రులు, బంధువులు, గౌరవనీయులు, పెద్దలు - నామాట మన్నించి, వీనికి విద్యాబుద్ధులు నేర్పమని అభ్యర్థించినాడు.

ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుని వలెనే, ఈయనకు తన కుమారుని 'ప్రగతి' తెలుసుకొన కోరిక గలిగినది.

శా. అంతం గొన్ని దినంబు లేగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుండై నిజనందనున్ గురువులే జాడం బఠింపించిరో
భ్రాంతుండేమి పఠించెనో పిలిచి, సంభాషించి విద్యా పరి
శ్రాంతింజూచెదఁగాకనే, డని మహా సౌధాంత రాసీనుఁడై
(భాగ. సప్త. అధ్యా. 8. 136 ప.)

కుమారునితో బాటు గురువులను తన సౌధమునకు రప్పించినాడు.

వారు వచ్చునప్పటికి హిరణ్యకశిపుడు మదిరాపాన గోష్ఠిలో అనేక విలాసినీ పరివృతుడై ఉన్నాడని ఎఱ్ఱనగారు వర్ణించినారు. హిరణ్యకశిపునిది దుష్టపాత్ర. ఆతనిని వ్యసనపరునిగా, దుష్టస్వభావునిగా పోతన కంటే ఎఱ్ఱన గారే ఎక్కువగా చిత్రించినారు.

వ. ఇట్లు రావించినం జనుదెంచి మదిరాపాన గోష్ఠీ సమయంబున ననేక విలాసినీ పరివృతుండై యున్న జనకునిం గని సమస్కరించి యుపాధ్యాయ సహితంబుగా (ప్రహ్లాదుడు) నంతత నాసీనుడయ్యె...
(నృసిం. చతు. వచ. 4)

ఇక విద్యా విషయములో తండ్రి - కుమారుల సంభాషణము. తనయుని విద్యాభివృద్ధిని పరీక్షింపదలచి, ఆ అసురేశ్వరుడు-

ఉ. పాపఁడ యింత కాలమును బాయక యొజ్జల యొద్దనుండి నీ
వేపగిదిన్ బఠించి తది యేర్పడఁ బ్రస్ఫురితార్థ సారమై
తీపులం పీనులం గురియ దివ్య సుభాషిత రత్న మొక్కటు
ద్దీపిత విజృంభణ, విధేయత యొప్ప నుపన్య సింపుమా
(నృసిం. చతు. 5 ప.)

వీనుల విందుగా ఒక దివ్యసుభాషితాన్ని వివరించమన్నాడు. ఆ వివరణము గూడ "ఉద్దీపతధీ విజృంభణ విధేయత యొప్ప" ఉపన్యసించవలెనట. ఈ రోజు లలో తండ్రులకు తమ తనయుల విద్యాబుద్ధులను పరీక్షింప సమయమెక్కడ? ఓర్పు యెక్కడ? నిద్ర లేచినది మొదలు 'నిజదార సుతోదర పోషణార్థమై' పరుగులు తీయుటకు, విలాసముగా జీవించుటకే సమయము చాలుటలేదు.

వచ్చిన ప్రహ్లాదుని జూచి పోతనగారి హిరణ్యకశిపుడు ఎంతో ఆనందము పొందినాడు. పితృవాత్సల్యము గుండెలోనుండి పెల్లుబికి వచ్చినది.

శా. ఉత్సాహ ప్రభుమంత్ర శక్తియుతమే యుద్యోగ మారూఢ సం
విత్సంపన్నుఁడవైతివే చదివితే వేదంబులున్ శాస్త్రముల్
వత్సా! రమ్మని చేరఁజీరి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపగన్.
(భాగ. సప్త. 139 ప.)

కుమారుని చేరఁజీరి, ఉత్సాంగాగ్రమున జేర్చి ప్రశ్నించి నాడట. అంతేకాక,

క. అనుదిన సంతోషణములు
జనిత శ్రమ తాపదుఃఖ సంశోషణముల్
తనయుం సంభాషణములు,
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్
(140 ప.)

అని, తండ్రులకు తమ పిల్లల ముద్దుమాట లెటులుండునో వర్ణించినాడు. తనయుని ఆకార, స్వభావము లెటులున్నను, ప్రవర్తన ఎటువంటిదైననూ, వాని పలుకులను మెచ్చుట వాని బుడి బుడి మాటలకు, నడకలకు పరవశ మొందుట మనము లోకములో చూచుచునే ఉన్నాము. కాకిపిల్ల ఎటువంటిదైనను దాని తల్లికి ముద్దేగదా!

తండ్రి ఆజ్ఞ అయినది. తాను నేర్చినది చెప్పదలచుకున్నాడు ప్రహ్లాదుడు. ఒక్కక్షణం కనులు మూసుకొని—

సీ. ఆదియు మధ్యంబు నంతంబు నెవ్వాని
కరయలేదని చెప్పు నాగమములు
పొడముటయును లేక పొదలుటయును లేక
తఱుగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వనివలనన యంతయు సంభవ
స్థాన సమాహార దశల జెందుఁ
గారణంబులకెల్ల కారణం బై యెవ్వఁ
డపగత కారణుండై వెలుంగు

గీ. నమ్మహానుభావు నచ్యుతు నవికారు
నమితతేజు విష్ణు నాదిదేవు
నా(శ్రయించినాఁడ నధిప యింతయకాక
యితరమైన యర్థ మెఱుఁగ నేను. (నృసిం. చతు. 7 ప.)

ఆగమములు ఏ దేవదేవుని ఆది మధ్యాంత రహితునిగ చెప్పుచున్నవో, ఎవ్వరికి వృద్ధిక్షయము లేవో ఎవరు కారణములన్నింటికి కారణమో, అటువంటి మహానుభావుని, అచ్యుతుని, అవికారుని, అమిత తేజస్సుతో ప్రకాశించువానిని ఆశ్రయించినాడట. అతనిందప్ప వేరొక్కరిని ఎరుగుడట. ఇది ఎఱ్ఱనగారి ప్రహ్లాదుని జవాబు.

ఉ. 'ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటి నూతిలోపలం
ద్రెళ్ళక మీరు నేనను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్య కళామయ మంచు విష్ణునం
దుల్లముఁజేర్చి తారడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ!
(భాగ. సప్త. 142 ప.)

పోతనగారు సంసారమును చీకటి నూతితో పోల్చుచు, ప్రదుహ్లాని ద్వారా ఒకే సూర్యుని అసంఖ్యాక ప్రతిబింబములు విభిన్న దర్పణములలో కానబడినట్లు, సంసారములోని సర్వవస్తువులయందు, ప్రాణికోటియందు ఆ పరమాత్మ ఉన్నాడను విషయము గుర్తింపజాలక, 'మీరు, నేను' 'అతడు, అది' అని వేర్వేరుగా భావించుచు, అజ్ఞానము అనెడు అంధకారములో కొట్టుమిట్టాడుచున్నారని మనకు చెప్పుచున్నారు.

అంతే! ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుని గుండెల్లో క్రోధాగ్ని పెల్లుబికినది. కన్నులు విస్ఫులింగములైనవి. ముఖము కందగడ్డ అయినది. నాసాపుటము బుబ్బినవి. భృకుటి ముడివడినది. పెదవులు కొరుకుచు, ఎంతటివారికైన భీతి కలిగించు హావ భావములతో గురువుల వైపు దృష్టి సారించి—

సీ. అక్కట బ్రహ్మ బంధువ, దురాత్మక, నా పగవాని కీర్తనం
బెక్కడనుండి యీ శిశువు నెప్పగిదిం జదివించి తిజ్జగం
బెక్కటి నేలు నా మహిమ యేమియుగైకొన కివ్విధంబునన్
దక్కువ పాటొనర్చితి వృథాపరిజల్పన కల్పనంబునన్.
(నృసిం. చతు. 9 ప.)

గురువులు కుమారునకు బద్ధవైరియైన హరిబోధనలు చేసినారని దృఢముగా నమ్మి వారిని నిందింపసాగెను తన మహిమ తెలియచెప్పనందుకు కూడ ఆదైత్యుడు అగ్గిమీద గుగ్గిలమే అయినాడు.

కాని, పోతనగారి హిరణ్యకశిపుడు వెంటనే కోపగించుకొనలేదు ప్రహ్లాదుని ముఖత: 'విష్ణు-ప్రశంస' వినగనే కొంచెము తబ్బిబ్బయిననూ—

వ. దానవేంద్రుడు నగుచు నిట్లనియె.

క. ఎట్టాడిన నట్టాడుదు
రిట్టిట్టని పలుక నెఱుఁగ, రితరుల శిశువుల్
దట్టించి యెవ్వరేమని,
పట్టించిరొ బాలకునకు బర పక్షంబుల్! (భాగ. సప్త 144 ప.)

తన కుమారుడు అమాయకుడూ, నిర్దోషియని, ఇతరుల శిశువులే యితనికి పరపక్షముల మాటలు-అనగా-హరి మహిమలు-చెప్పి పాడు చేసినారనియు ఆతడు తలచెను. ప్రహ్లాదుని ఉద్దేశించి —

"కుమారా! నాకిది చాల ఆశ్చర్యముగ నున్నది. ఈ బుద్ధి నీకు తోచినదా? లేక పరులు నేర్పినదా! లేక ఈ గురువులు ఏకాంతములో బోధించినారా, ఆ విష్ణువు మన వంశానికి తీరని అపరాధములు చేసినాడు. అతనినేల బొగడెదవోయీ?" అని మందలించినాడు.

శా. నాకుంజూడగ జోద్యమయ్యెడిగదా! నా తండ్రి! యీ బుద్ధి దా
నీకున్ లోపల దోచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీ దానవ శ్రేణికిన్
వైకుంఠుడు గృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీకేటికిన్?
(భాగ. సప్త. 145 ప.)

అంతేకాదు,

మ. సురులందోలుటయో, సురాధిపతులన్ స్రుక్కించుటో, సిద్ధులం
బరి వేధించుటయో, మునిప్రవరులన్ బాధించుటో, యక్ష కి
న్నర గంధర్వ విహంగ నాగపతులన్ నాశంబు నొందించుటో
హరి యంచున్ గిరి యంచు నేల చెడ మోహాంధుడవై పుత్త్రకా?
(భాగ. సప్త. 146 ప.)

ఆహా! తా చెడ్డకోతి వనమెల్ల చెరచినట్లు, తండ్రి అయివుండి తన తనయునికి ఎంత 'చక్కని' ఉపదేశము చేయుచున్నాడు? తన కడుపున పుట్టి నందుకు సురలను, సిద్ధులను, మునులను, కిన్నర, గంధర్వ, నాగరాజాదులను పీడించవలెనట. హరినామ స్మరణ చేసిన చెడిపోవునట. మోహాంధత కలుగునట. 'హరి, గిరి' అని వ్యంగోక్తులను కూడ ప్రయోగించినాడు.

ప్రహ్లాద కుమారునికి హరిని గూర్చి తెలియుటలో తన పాత్ర ఇసుమంతయు లేదని నెత్తియు, నోరును కొట్టుకున్న గురుపుత్రుని మన్నించి, ఆ దైత్య నాధుడు మరల తన పుత్రునితో—

క. ఓ వత్స! నీవు చెప్పిన
యీ విధమే జెప్పనరియె నిదె యొజ్జలు నీ
కేవాడు గఱపె నేర్పడ
గా వెఱవక చెప్పు మట్టి ఖలు దండింతున్. (నృసి. చతు. 13 వ.)

అని ప్రశ్నింపగా, దానికి ప్రహ్లాదుడు ఇచ్చిన ప్రత్యుత్తరము:

ఉ. నావుడు దైత్యరాజ కులనందను డిట్లను 'సర్వభూత స
ద్భావములందు నుండి పనుపం గఱపంగ, బ్రహ్మాండనాయకుండు మా
దేవుడుఁ వాసుదేవుడు సుధీసు విధేయుడు చిత్సుఖోదయ
శ్రీవరుడింత కంటె మరి చెప్పగలండె ప్రశాస్త్రి యెవ్వడున్?'
(నృసిం. చతు. 14 వ.)

శ్రీహరిని గురించి చెప్పుట కెవరితరము? ఆయనయే స్వయముగా సర్వ భూతములందు భాసిల్లుచు, సద్భావములలో విలసిల్లుచూ తన ఉనికిని గూర్చి అసంఖ్యాక ముఖములతో వ్యక్తపరచుచున్నాడు గదా! అని జవాబు ఇచ్చినాడా "చిచ్చర'పిడుగు'."

తండ్రి చేసిన 'మహోపదేశము' విని, గురువులవంక వీక్షించుచూ పర మేశ్వరుని గూర్చి- "మోహనిర్మూలనము చేసి అసద్గ్రాహ్యంబగు భేదంబు తొలగించెడివాడని" పల్కి-

శా. అజ్ఞుల్ గొందరు నేము దాము నను మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమణునిన్ భాషింపగా నేర రా
జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్, దర్శింపగా నేర్తురే?
(భాగ. సప్త. 148 ప.)

అజ్ఞానులు కొందరు విష్ణువును గుర్తించక మాయామోహితులై సంచ రింతురు.

తన చిత్తవృత్తిని వివరించుచూ-

తే. ఇనుమయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమున
గరగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు. (భాగ. సప్త. 149 ప.)

గురువర్యా! బ్రాహ్మణోత్తమా! దైవయోగమున ఇనుము వంటి నా మనస్సు అయస్కాంతమువంటి శ్రీ మహావిష్ణువువైపుకు ఆకర్షింపబడుచున్నది. వేరొక్కటి నన్ను ఆకర్షింపలేదు నా హృదయముకూడ వేరొకవైపుకు ఎట్టి పరిస్థితి లోనూ ఆకర్షింపబడదు.

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలదూగు
రాయంచ-చనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు-
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరక
మ్మరుగునే సాంద్రనీహారములకు

తే. నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల! మాటలు వేయునేల?

పోతన విరచితమైన పద్యములన్నిటిలో జనప్రియమై ఇంటింట మారు మ్రోగిన పద్యములలో ఇదొకటి నారాయణ నామామృత రుచి చవి చూసిన చాలును, ఇక వేరొండు గ్రహింప మనసు యిచ్చగింపదు. దానితోడిదే లోకము. మెలకువలోనూ, నిదురలోను ఇక అదే చింత. మందార మకరంద మాధుర్యము చవిజూసిన మధుపము,నిర్మల మందాకినీ జలములకు అలవాటుబడిన రాజహంస, కోమలమైన చిగుళ్ళు తిను కోయిల, వెన్నెల ననుభవించు చకోరపక్షి వంటిదే 'అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేష మత్తమైన చిత్తము.

పోతనగారి పురోహితునకు ప్రహ్లాదునిపై కొంత స్వాతంత్ర్యము ఉన్నది. రాచకుమారుడైననూ, అతడు అయన శిష్యుడే. ఆ చనువుతో—

ఉ. పంచశరద్వయస్కుఁడవు, బాలుఁడవించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు, సెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుక యైన జెప్ప వసురేంద్రుని ముందట మాకు నౌదలల్
వంచుకొనంగఁ జేసితివి, వైరి విభూషణ! వంశభూషణా!

(152 ప.)

"ఐదేండ్ల వయసువాడవు, పిట్ట కొంచెము కూత ఘనమన్నట్లు, వయసుకు మించిన మాటలు వల్కుతున్నావు. నేర్పిన శాస్త్రములోని ఒక్క వాక్యమునకైన అర్థము చెప్పవు. నీ ప్రవర్తన వలన మేము తలవంచుకొనవలసి వచ్చినది" అని గర్హించుటయే కాదు —

చ. తనయుఁడుగాఁడు, శాత్రవుఁడు దానవ భర్తకు వీఁడు దైత్య చం
దన వనమందుఁ గంటకయు తక్షిత జాతము భంగి బుట్టి నా,
డనవరతంబు రాక్షస కులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు, దం
డనమునగాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్.

(154 ప.)

ఈ 'అర్భకుడు' కుమారుడు గాడు, కుమారుని రూపములో ఉన్న శత్రువు.మన అసురవంశము అనే చందనవనంలో మొలచిన తుమ్మ మొక్క.మన మాట నిర్లక్ష్యము చేయుచు ఆ అసురవైరినే నిరంతర ముస్మరించు ఈ బాలునికి దండోపాయమే సరియైనది. దండం దశగుణం భవేత్! దెబ్బకు దయ్యము వదలిపోవును. కావున వీనిని పట్టి కొట్టుడని ఆ గురువర్యుడు ఆజ్ఞాపించెను.

అంతేకాదు—

క. ఈ పాపని జదివింతుము
నీ పాదములాన యింక నిపుణత తోడం
గోపింతుము, దండింతుము
కోపింపకు మయ్య దనుజకుంజర! వింటె. (భాగ. సప్త. 154 ప.)

'దనుజేశ్వరా! మీ పాదములపై ప్రమాణము. ఈసారికి క్షమించండి. ఈ పాపణ్ణి బాగా కోపించి, దండించి, సరియైన మార్గములో పెట్టెదము. కోపము చెయ్యవలదు' అని హిరణ్యకశిపుని ప్రార్థిస్తారు.

కాని ఎఱ్ఱనగారి హిరణ్యకశిపునిముందు గురువుకంత చనువు ధైర్యము, లేవు. తనయుని జవాబువిని మండిపడి ఎవడురా ఆ విష్ణువు అని ప్రశ్నించగా—

చ. అనుటయు నల్లనవ్వి కొడుకయ్యకు నిట్లను నెవ్వడన్న నే
మని తెలుపంగవచ్చు బరమాత్ముని నాతడ యీ సమస్తమున్
వినుము తదేక హేతుకము విశ్వము శాశ్వతమైన తత్పదం
బనిశము పుణ్యశీలురు నిజానుభవంబున గాంతు రేర్పడన్.
(నృసిం. చతు. 16 ప.)

ప్రహ్లాదుడు విష్ణుని గురించి వివరిస్తూ అంటాడు —

ఆయన గురించి ఏమి చెప్పగలను ? ఆయన అనిర్వచనీయుడు, అవర్ణనీయుడు, అవాఙ్మానస గోచరుడు, అఘటిత ఘటనా సమర్థుడు; ఈ సమస్తమంతయు అతడే. ఆయన కారణము చేతనే ఏర్పడినది ఈ జగత్తు. పుణ్యాత్ములు తమ అనుభవము ద్వారానే ఎల్లప్పుడు ఆయనను దర్శించుచుందురు.

తే. నాకకాదు లోకములకు నీకు బ్రభుడు
వినుము పరమేశ్వరుండను విష్ణుడొకడు
ధాతయును విధాతయును నతండ యిందు
నలుక విడువుము శాంతుడవగుమయ్య తండ్రి
(నృసిం. చతు. 18 ప.)

తండ్రీ! శ్రీ మహావిష్ణువు నాకు, అన్ని లోకములకు, నీకును గూడ అధిపతి. అతడే ధాత, విధాత, కర్త, భర్త. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన ఆయనపై ఆగ్రహించక శాంతించి, ఆలోచించుము.

ఇటువంటి మాటలు వినగనే, ఆ దైత్యవల్లభునికి సందేహము, భయము, ఆశ్చర్యము, క్రోధము, దిగులు, సంశయము ఒక్కసారిగా కలిగినవి. పోతన గారి హిరణ్యకశిపుడు తన కుమారుని ప్రవర్తనకు ఇతర దనుజుల పిల్లలు కారణమని కొంతసేపు, గురువులే నేర్పి ఉందురని ఇంకొంతసేపు తలపోసెను కదా? కాని ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుడు—

క. నావుడు హిరణ్యకశిపుం
డీ వెడగుదనంబు భూత మెయ్యదియో యి
ట్లావేశించెగా కిత
డీ విధమున నేల యనుచు నిటు ప్రల్లదముల్?

(నృసిం. చతు 19 ప.)

తన తనయునికి మాటలకు, చేష్టలకు కారణము ఏదైన భూతము అవహించి యుండునేమోనని సంశయపడెను. అప్పుడు ప్రహ్లాదుడు తన తండ్రితో—

ఉ. నా మన మొక్కడేల దితినందన సర్వము నావహించి తే
జోమహిమన్ వెలుంగు హరి చోద్యపు భూతమతండు లీలమై
వేమఱు నిన్ను నన్నుఁ బెఱ విశ్వచరాచర భూత జాతమున్
భ్రామకుఁడై నిజోచిత విభావిత చేష్టలఁ గూర్చు నెప్పుడున్.

(నృసిం. చతు. 21 ప.)

'కేవలము నాలోనేకాదు అంతటా తేజో రూపములో ఆవరించి ఉన్న విచిత్ర భూతమతడు. వేమరుపాటు ప్రవర్తించు నిన్ను, నన్ను, చరాచర ప్రపంచాన్ని తన లీలా చేష్టితములతో నడిపిస్తూ ఉంటాడని అన్నాడో లేదో, దండ తాడితభుజగమువలె, భగ్గన దరికొన్న, భీషణ హుతాశన జ్వాలాకీలవలె ఎగిసిపడ్డాడు దైత్యరాజు. 'వీడిని తీసుకొని పోయి గురుగృహమున త్రోసిరండు. వీని చిత్త విభ్రమములు, మానసిక జాడ్యములు తొలగిన తర్వాతే తీసుకుని రండు. రకరకములైన పద్ధతులను ఉపయోగించి, బాలుని సరియైన మార్గములో పెట్టుడు' అని గురువుల నాజ్ఞాపించెను.

గురువులు అవమాన, క్రోధములతో బాలుని తమ ఆశ్రమమునకు తీసుకొని పోయి, సామ దాన భేద దండోపాయంబులన్నియు నెఱింగించి నీతి కోవిదుండయ్యెనని నమ్మి, నిశ్చయించి—

ఉ. త్రిప్పకుమన్న మా మతము, దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకుమన్న, నేడు మన దైత్య వరేణ్యుని త్రోల, నేము మున్
చెప్పిన రీతిగాని మఱి, సెప్పకుమన్న విరోధి శాస్త్రముల్,
విప్పకుమన్న దుష్టమగు విష్ణు చరిత్ర కథా జాలముల్.

అని ప్రహ్లాదుని బుజ్జగిస్తారు. (భాగ. సప్త. 158 ప.)

తరువాత హిరణ్యకశిపుని యొద్దకు తీసుకొని రాగా—తండ్రి యేప్పటివలె యొక్క సుభాషితము చదవమని అడుగగా—

క. ప్రకృతి పురుషాత్మకంబును
సకల చరాచర విశేష సర్గము నెవ్వా
నికిఁ గార్యం బవ్విష్ణుని
వికార రహితు సమస్తవిభుఁ బ్రణుతింతున్. (నృసి. చతు. 28 ప.)

ప్రకృతి పురుషాత్మక రూపుడై, సకల చరాచర సృష్టికార్యములు చేయు, వికార రహితుడూ, త్రిగుణాతీతుడు, అవ్యయుడూ అయిన ఆ విష్ణునికి నమస్కారము అని జవాబిస్తాడు ప్రహ్లాదుడు.

ఇక పోతనగారి ప్రహ్లాదుడు ఇంకో రెండాకులు ఎక్కువ చదివినవాడు.

ఆశ్రమమునుండి హిరణ్యకశిపుని సన్నిధికి వచ్చు వేళలోనే—

సీ. అడుగడుగునకు మాధవాను చింతనసుధా
మాధుర్యమున మేను మఱచువాని
నంభోజ గర్భాదు లభ్యసింపఁగలేని
హరి భక్తి పుంభావమైనవాని
మాతృగర్భము నొచ్చి మన్నది మొదలుగాఁ
జిత్త మచ్యుతమీదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిల ప్రపంచంబు
శ్రీ విష్ణుమయ మని చెలఁగువాని

తే. వినయ కారుణ్య బుద్ధి వివేక లక్ష
ణాది గుణముల కాట పట్టయిన వాని
శిష్యు బుధలోక సంభావ్యుఁ జీరి గురుఁడు
ముందటికి ద్రొబ్బి తండ్రికి మ్రొక్కుమనుచు. (భాగ. సప్త. 160. ప)

పోతనగారి శబ్దశక్తి, భావనాపటిమ, చరిత్ర రచనా నైపుణ్యములకు ఈ పద్యము అద్దము పట్టుచున్నది. మన కన్నుల ఎదుట శిష్యుని ముందుకు త్రోయుచున్న గురువు, ఆ గురువు ముఖములో ఏమగునో ఏమోనను భయాందోళనలు కనిపిస్తే, భగవన్నామ స్మరణలో తనువు, మనసూ, స్వాధీనము లేక అడుగడుగునా తడబడువాడూ, బ్రహ్మాదులకు సాధ్యముగాని అభ్యాసము చేయువాడూ, తల్లి గర్భములో జేరినాటి నుండి అచ్యుతునే తలచువాడూ, తనలోనూ, తన బయటా హరిదర్శనము చేయువాడూ, వినయాది సలక్షణ సంపన్నుడూ అయిన ప్రహ్లాద కుమారుడు కనబడతాడు.

ప్రహ్లాదుని ముద్దుల మోము, ఆ మోవిపై మనసు చూరగొను ముగ్ధమనోరమైన, చిరునవ్వు. ఆ నవ్వులో పవిత్రత, అమాయకత చూడగానే పోతనగారి హిరణ్యకశిపుకు గతమంతా మరచిపోయినాడు బాలుని వినయ విధేయతలకు పులకించి పోయినాడు. తన దారి కొచ్చినాడని తలచి, కాదు...కాదు, భ్రమసి. చేతులు సాచి, దగ్గరకు చేరబిలిచి, ప్రేమానురాగములు మదిలో ఉప్పొంగగా, కౌగలించుకొని, తన తొడలమీద కూర్చుండబెట్టుకొని, ముద్దుపెట్టి, శిరస్సు నిమిరి, గడ్డము తడిమి కన్నుల ఆనంద, ప్రేమభరితమైన నీరు తొణికిసలాడగా—

శా. చోద్యంబయ్యెడి నింతకాల మరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువులే వెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగ గోరెద భవద్విజ్ఞాత శాస్త్రంబులో
బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా!

అని అడిగి—

శా. నిన్నున్ మెచ్చరు నీతి పాఠమహిమన్ నీతోటి దైత్యార్భకుల్
గన్నారన్నియు జెప్పనేర్తురు గదా, గ్రంథార్థముల్ దక్షులై
యన్నా! యెన్నడు నీవు నీతి విదుఁడౌదంచున్ మహావాంఛతో
నున్నాఁడన్, ననుఁగన్న తండ్రి, భవదీయోత్కర్షముం జూపవే!

(భాగ. సప్త. 163 మరియు 164 ప.)

నా కన్నతండ్రీ! చూడు, నీతోటివారంతా అన్నిటిలో ముందున్నారు! ఎన్నో విషయాలు నేర్చుకున్నారు. నీవుకూడా నీతి విదుడవౌతావని, నేను మహా వాంఛతో ఎదురుచూస్తున్నాను. నాకు తెలుసు, నీవు వారికంటే ఎక్కువగానే చదువులు నేర్చి ఉంటావు. ఏది నీ ప్రత్యేకత? నాకు చూపించు. గురువులు ఏమి చెప్పిరో, నీవేమి నేర్చితివో వినవలెనని నాకెంతో కోరికగ ఉన్నది. ఏదైనా చదివి వివరించి చెప్పు బాబూ! అని అర్థించాడు లాలనగా హిరణ్యకశిపుడు.

అంతే! ప్రహ్లాదుని గుండె ఆనందముతో పరవళ్ళు త్రొక్కినది. మౌన మనే అడ్డును ఛేదించుకొని, హరిభక్తి అను గంగాప్రవాహ ఝరి ప్రచండ వేగముతో నోటిద్వారా బయట పడినది. పోతనగారు ఈ అవకాశాన్ని ఇలా చక్కగా ఉపయోగించుకున్నారు:

మ. తను హృద్భూషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా!
(భాగ. సప్త 167 ప.)

భాగవతమంతటా ప్రతిపాదించబడినది భక్తి. త్రిగుణముల (సాత్త్విక, రాజస, తామసములు) చేతనూ దీనిని సాధించుకున్న భక్తులెందరో మనకు తెలుసును. ప్రహ్లాద అంబరీషులు సాత్త్విక భక్తులైతే, హిరణ్యకశిప కంసాదులు రాజస భక్తులు, మరి గజేంద్రాదులు తామసభక్తిని నమ్మి తరించినవారు.

భక్తియందు దయాశౌచాదులు విభావములు, క్షేత్రోత్సవములు ఉద్దీపన విభాగములు అయినా, దర్శన, శ్రవణ, స్మరణ, దాస్య, సంకీర్తనాదులు అనుభవములు.

పైన ఉదహరింపబడిన పద్యములో నవవిధ భక్తి పద్ధతులను వివరించి నాడు భక్త శిరోమణి పోతన. ఇవి దాస, మధుర భక్తులకు మూల సూత్రముల వంటివి. సఖ్య, శ్రవణ, దాసత్వ, వందన, అర్చన, జ్ఞాన, సంకీర్తన స్మర ణాదులవలన కలుగు రోమాంచ, స్వేద, కంపన, స్తంభనాదులు సాత్త్విక భావ ములు. రతిస్థాయి "రసోవైసః" ఈ "తొమ్మిది మార్గముల సర్వాంతర్యామియైన

శ్రీహరిని త్రికరణ శుద్ధిగా కొలచి, నమ్మిన సజ్జనులవలె వుండుట అన్ని విధముల శ్రేయోదాయకమనుటే సత్యము" అని చెప్పి,

శా. అంధేందూదయముల్, మహాబధిర శంఖారావముల్, మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్, నపుంసక వధూ కాంక్షల్, కృతఘ్నావలీ
బంధుత్వంబుల్, భస్మహవ్యములు లుబ్ధ ద్రవ్యముల్, క్రోడప
ద్గంధంబుల్, హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్.

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

తె. దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీ ధవుఁ జెప్పెడి గురుడు గురుడు
తండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి.

మానవునికి పరమేశ్వరుడు ఇంద్రియములను ప్రసాదించినాడు. పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి ఆ శ్రీహరి పనులకు ఉపయోగించినప్పుడే వాటికొక సార్థత చేకూరును. మానవ జన్మ ధన్యమగును అట్లు వినియోగింపబడనిచో ఆ ఇంద్రియములు ఇంద్రియములుగావు.

సీ. కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవన గుంఫిత చర్మ భస్త్రిగాక
వైకుంఠు పొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరి పూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తను కుడ్యజాల రంధ్రములు గాక

ఆ. చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువు గాక? (భాగ. సప్త. 170 ప.)

తన శరీరము, నోరు, హస్తములు, కన్నులు మొదలగు ఇంద్రియ ములతో అహర్నిశలూ మానవుడు చేయవలసిన పని హరి నామస్మరణ. అట్లు చేయని వాని జన్మ వ్యర్థము. హరిభజన చేయనివాడు పండితుడైననూ, పామరుని క్రిందనే పరిగణించబడును.

మహా భక్తుడు శ్రీ కులశేఖరుని శ్లోకము ఈ సందర్భములో జ్ఞప్తికి వచ్చును :

జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో! భజ శ్రీధరం
పాణి ద్వన్ద్వ! సమర్చయాచ్యుత కథాః శ్రోతద్వయం త్వం శృణు!
కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకున్దపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్
(ముకుందమాల—16 శ్లో.)

ఓ నాలుకా! కేశవుని కీర్తింపుము. ఓ మనసా! మురహరుని భజింపుము. ఓ హస్త ద్వంద్వమా! శ్రీధరుని ఆరాధించుము. ఓ శ్రోత్రద్వయమా! అచ్యు తుని కథలను వినుము. ఓ నేత్ర ద్వంద్వమా! కృష్ణుని చూడుము ఓ పాద ద్వంద్వమా! భగవానుని ఆలయమునకు నడువుము. ఓ నాసికా! మోక్షము నిచ్చు ముకుందుని పాదములపై అలంకరించబడి తొలగించబడిన తులసిని వాసన చూడుము. ఓ శిరసా! అధోక్షజునికి వంగి నమస్కరించుము.

ఎఱ్ఱనగారి ప్రహ్లాదుడు తనకు నచ్చ చెప్పు గురువుతో :

సీ. వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁ దండ్రిగాఁడు
వేద చోదితమైన విష్ణు ధర్మమునకుఁ
గోపించు గురుడును గురుడు గాఁడు
భవ దుఃఖములు మాన్పఁ బ్రభువైన హరిసేవ
నెడలించు హితుఁడును హితుఁడు గాఁడు
పరయోగమతమగువైష్ణవ జ్ఞానంబు
వదలిన చదువును జదువుగాదు

గీ. కేశవాకార లీలలు గీలుకొని ము
దంబుఁ బొందని తలఁపును దలఁపుగాదు
మాధవస్తోత్ర ఘనసుధా మధుర రుచులఁ
జిలుక కుండెడు జిహ్వయు జిహ్వగాదు. (నృసిం. పంచ. 22 ప.)

ఎఱ్ఱన నిషేధరూపములో వ్రాసిన ఈ పద్యములో భావము ఎంతో అపురూపముగ ఉన్నది; కాని పద్యమునకు ప్రధానమైన శయ్య కుంటుపడినది.

వాసుదేవుని యెడల భక్తి వలదని చెప్పువాడు తండ్రి కాడు. విష్ణువు యెడల క్రోధము వహించువాడు గురువుకాడు. హరియెడల విముఖుని చేయువాడు మిత్రుడు కాడు. వైష్ణవజ్ఞాన రహితమైన చదువు చదువుకాదు. కేశవుని తలపోయని బుద్ధి, మాధవుని నామముచ్చరించని నాలుక బుద్ధి, నాలుకలనిపించు కొనవు—

తన కుమారుని ద్వారా హరి ప్రశంస వినగానే హిరణ్యకశిపునికి కోపం ముంచుకొచ్చింది.

క. అనినఁ గడుఁ గడిఁడియై మదిఁ
గనలు నిగుడఁ బుత్ర భావ కలిత స్నేహం
బును గృపయుఁ బాయ సురరిపుఁ
డనుచరులం జూచి యిట్టులను రభసమునన్. (నృసిం చతు. 24 ప.)

క. కులమునకు గొడ్డలి
ఖలుఁడు కులాంగారకుఁడు కష్టుఁడు వీనిం
బొలియింపుఁడు ఘన శస్త్రం
బుల వెస నొక గుడ్డు మురిగిపోనేమి యగున్. (నృసి. చతు. 25 ప)

కులమునకు గొడ్డలిపెట్టయినటువంటి దుష్టుడైన వీనిని చిత్రహింసలు పెట్టుడు. ఒక 'గుడ్డు' మురిగిపోయినవచ్చిన నష్టమేమున్నది? తండ్రిమాట ధిక్కరించి ఈ రీతిని నడచుకునేవాడు పుత్రుడు కానేకాడు వీడు శత్రుపక్షములోనివాడు. శత్రువు సదా వధ్యుడు కదా! నేను చూచుచుండగ వీనిని హింసించుడని ఆజ్ఞాపించినాడు.

పోతనగారి హిరణ్యకశిపుడు పుత్రుని ముఖతః హరిప్రశంస వినినాడు. క్రోధము కల్గిననూ తమాయించుకొనినాడు. తనకోపమును గురుపుత్రునిపైననూ, తుదకు తన పుత్రునిపైననూ ప్రకటించలేదు. తమాయించుకొని ప్రశ్నించ సాగినాడు :

క. ఒజ్జలు సెప్పని యీ మతి
మజ్జాతుఁడవైన నీకు మఱి యెవ్వరిచే
నుజ్జాతమయ్యె బాలక!
తజ్జనులం బేరుకొనుము తగనా మ్రోలన్. (భాగ. సప్త. 181)

'తండ్రికి' ఇంకనూ అనుమానమే. తన పుత్రుడు నిర్దోషియని, పరు లెవ్వరో అతని 'చెడగొట్టిరని' దృఢ విశ్వాసము. వారి పేర్లు చెప్పమని బుజ్జ గించుచూ అడగసాగినాడు. ప్రహ్లాదుడు వెంటనే జవాబు చెప్పాడు.

ఉ. అచ్చపుఁ జీఁకటింబడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్విత చర్వణులైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిననైన హరిప్రబోధముల్
(భాగ. సప్త. 181 ప.)

పోతన మూలతత్వం అతిక్రమించకుండగనే స్వకపోల కల్పనలు చేశాడు. సంస్కృతంలో ఉన్న మూల భాగవతంలోని అర్థాన్నే హృదయంగ మంగా తన పద్యంలో పైవిధంగా వ్యక్తపరచాడు.

సంస్కృతంలో ఉన్న భాగవతంలో వ్యాసుని కథనం—

మతిర్నకృష్ణే పరత స్స్వతోవా మిథోభి పద్యేత గృహవ్రతానాం
అదాంత గోభిర్విశతాం తమిస్రం పునఃపున శ్చర్విత చర్వణానామ్॥

అజ్ఞానమనే అంధకారముతో నిండిన ప్రపంచముల బడి కొట్టుమిట్టాడుచూ, సంసార బంధనములలో చిక్కి, 'పునరపి జననం పునరపి మరణం' పొందుచూ సమాధానపడు వారికి ఇతరులు చెప్పిననూ, లేదా తనంతట తానుగా నైననూ హరిభక్తి పుట్టదు! ఒక శునకమన్నది దానికొక ఎముక దొరికినది. ఆ ఎముక పూడ 'రక్త' 'మాంస' రహితమైనది. అయిననూ ఆ ఎముక శునకమునకు

పరమానందకరమైనది. నోట కరచుకొని ఓ మూలకు చేరి, కొరకసాగింది. కళ్ళు మూసుకుని, తన బలమంతా ఉపయోగించింది. ఫలితంగా తన నోటినుండే రక్తము కారసాగింది. కాని, ఆ కుక్కకు అదేమీ పట్టలేదు. ఆ రక్తము తన రక్తమే అని తెలియక, ఎముక నుండి దొరకుచున్నదని భ్రమసి ఆనందముతో త్రాగుతున్నది. సాంసారిక జీవితములో లభించు అశాశ్వతమైన దుఃఖభాజనములైన నిస్సారములైన విషయవాసలను చూసి, భ్రమసి, వాటి ద్వారా కలుగు తాత్కాలిక సుఖములకు లొంగి, శాశ్వతమగు సుఖ దాయకమైన 'ఆత్మజ్ఞానమును పరమాత్మ తత్త్వాన్ని ఎరుగక, మరల మరలజన్మించి,మరల మరల మరణించి, మరల మరల జన్మించుచున్నారు. ప్రహ్లాదుని ద్వారా పోతన ఈ వేదాంత తత్త్వాన్ని చక్కగా వివరించినాడు.

అంతేకాదు —

ఉ. కాననివాని నూఁతగొని, కాననివాఁడు విశిష్ట వస్తువుల్
గాననిభంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణు, గొందఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోభిషిక్తులగు, సంహృత కర్ములు దానవేశ్వరా!

ఇంకొక విచిత్రము —

'అసలే గ్రుడ్డివాడు. ఇంకొక గ్రుడ్డివాడు దొరికినాడు. అతని సహకారముతో విశిష్టమైన వస్తువులను చూడదలచి బయలుదేరినాడు. అటులనే కొందరు కర్మ పాశములలో చిక్కుకొని, తద్వారా తమ 'ఖర్మ' కాల్చుకొని హరికి దూరమగుచున్నారు. కొందరు మాత్రము హరి పాదారవింద చింతనామృత పాన విశేష మత్త చిత్తులై సత్కర్మాచరణల ద్వారా సద్గతి పొందుచున్నారు.

ప్రహ్లాదుడింతటితో ఊరుకోలేదు—

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వేయేటికిన్
గాథల్ మాధవశేముషీ తరణి సాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాటఁగ వచ్చునే సుతవధూ మిత్రోగ్రవాంఛా మద
క్రోధోల్లోల విశాల సంసృతి మహా ఘోరామితాంభోనిధిన్.

(భాగ. సప్త. 188 ప.)

తండ్రీ! సర్వ శాస్త్రములు శోధించితిని. భార్యా పిల్లలను జలచరములతో అరిషడ్వర్గములను ఉత్తుంత తరంగములతో ఉన్న ఈ విశాల భవసాగరమును హరి యను నౌకతోగాక వేరు సాధనముతో దాటుటకు వీలుపడునా? వీలుపడదు. ముమ్మాటికీ వీలుపడదు.

తన ముకుందమాలలో శ్రీ కులశేఖరులు ఇటువంటి భావముచే వ్యక్తము చేస్తూ ఇలా అంటారు:

శ్లో. తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయ సహజ గ్రాహ సంఘాకులేచ
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం న స్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ (ముకుం. 15 వ శ్లో.)

సంసార సముద్రమును దాటుటకు నావ కావలెను. ఆ నౌక మహావిష్ణువే. ఆ విష్ణువునందు భక్తియే మానవుని తరింపజేయును. ఈ సముద్రములో, ఆశయే జలము. కామమను పెనుగాలి దానిని కదుల్చుచుండును. తత్ఫలితముగా మోహమను కెరటములు వరుసగా సాగుచుండును దీనిలో భార్య సుడిగుండము, బిడ్డలు బంధువులు మొసళ్ళు. ఇటువంటి సముద్రమును భక్తి-నావతోనే దాట తరమగును. ఇదే భావమును పోతన చక్కగా చెప్పినాడు.

హిరణ్యకశిపుని కోపము తారాస్థాయికి చేరినది. 'ఆ రక్కసుల ఱేడు తన కొడుకు ధిక్కరించి, మక్కువసేయక గొబ్బున దిగద్రొబ్బి, నిబ్బరంబగు కోపము దీపింప వేడి చూపుల మింటి మంట లెగయ—

శా. క్రోడంబై పినతండ్రిఁ జంపెనని తా, గ్రోధించి చిత్తంబులో
పీడం జేయఁడు బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁడై
యోడం డక్కట! ప్రాణవాయువులు పీడొప్పించుచున్నాఁడు నా
తోడన్ వైరము వట్టె నిట్టి జనక ద్రోహికిన్ మహిం గంటిరే? (185 ప.)

వ. అని రాక్షస వీరుల నీక్షించి యిట్లనియె: (186 ప.)

శా. పంచాబ్దంబులవాఁడు తండ్రినగు నా పక్షంబు నిందించి య
త్కించి ద్ధృతియులేక విష్ణు నహితుం గీర్తించు చున్నాఁడు వ
ల్దించుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్త్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించిరండు దనుజుల్ మీమీ పటుత్వంబులన్. (187. ప.)

'తన పినతండ్రి హిరణ్యాక్షుని, ఆ హరి వధించెనన్నదానికి క్రోధము, పగ పెంచుకోక, ఒక తుచ్ఛసేవకునివలె, ఆ హరికే భక్తుడై, కన్నతండ్రికి ద్రోహము చేస్తున్నాడు.

అయిదేండ్లవాడైన ఈ అర్భకుడు, నా పక్షమును నిందించి కొంచెమైననూ భయములేక, ఆ విష్ణువును పొగుడుతూ- నా మాటనే ధిక్కరించుచున్నాడు. మీ శక్తియుక్తుల నుపయోగించి, వీనిని వధించి రండు' అని రాక్షస వీరుల నాజ్ఞాపించెను. అంతేకాదు——

క. హంతవ్యుడు రక్షింపను
మంతవ్యుడుగాడు యముని మందిరమునకును
గంతవ్యుడు, వధమున కుప
రంతవ్యుండనక చంపి రండీ పడుచున్. (189 ప.)

"వీడిని నేను రక్షించనుగాక రక్షింపను - తీసుకొనిపోయి, చంపిరండు" అని రక్కసుల నాజ్ఞాపించెను.

కరకు గుండెల రక్కసులు ప్రహ్లాదకుమారుని ఎన్నియో రకములుగా బాధించారు. కాని-

చ. అనుపమ మేరు భూధర తటాధిక నిష్ఠుర వక్షు, వజ్ర సం
హననుఁ గుమారుఁ జెంది, యసురాధమకింకర నిర్విశంక పా
తనకనదస్త్ర శస్త్రములు దందడి దుత్తుమురై మహీతలం
బున దొరగెన్నవోత్పల సముజ్జ్వల నూత్నదళంబులో యనన్
(నృసిం. చతు. 81 ప.)

వారి ప్రయత్నములన్నియు వ్యర్థములయినవి. వారి అస్త్రశస్త్రములన్నీ బాలుని తాకగానే, తుత్తునియలై నేలబడినవి.

ఉ. బాలుడు రాచబిడ్డడు కృపాళుడు సాధుడు లోకమాన్య సం
శీలుడు వీఁడవధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరములై ప్రహరించి రుగ్రవా
చాలత నందఱున్ దివిజ శత్రుడు వల్దనడయ్యె భూవరా!
(భాగ. సప్త. 111 ప.)

పసిబాలుడనిగాని, రాజబిడ్డడనిగాని, కృపాలుడు, సాధువు, లోకమాన్యుడు, చంపదగనివాడినిగాని తలచక, కఠిన హృదయులై రాక్షసులు ప్రహ్లాదుని శూలాద్యాయుధములతో మోదుచుండ, ఆ దృశ్యము చూచుచుగూడ హిరణ్యకశిపుడు వలదనడాయెను

క. అది యట్లుకాదె, 'నిప్పునఁ
జెదలంటునె' దేవదేవు శ్రీ రమణీశున్
మది నునిచిన యుత్తమమునిఁ
బొదవునె యాపదలు సూర్యుఁబొందునె తమముల్
(నృసిం. చతుర్థ. 22 ప.)

నిప్పుకు చెదలంటనట్లు, చీకట్లు సూర్యుని మూయలేనట్లు ఆ రక్కసుల ఆయుధములు ఆ బాలునికి ఏమియు హాని చేయకుండెను. ఇందుకు కారణము ఆ బాలుడు హృదయములో శ్రీమన్నారాయణుని నిరంతరము స్మరించుటయే.

అక్కుమారుడు మహిత సమాధి నిష్ఠఁ
దై మహోగ్ర శస్త్రావలియందు నసుర
లందుఁ దనయందు వెలుగు సర్వాత్మ విష్ణుఁ
గనుచుండె నిశ్చల నిర్వికార లీల (నృసిం. చతు. 29 ప.)

ఆ బాలుని కళ్ళకు తండ్రి ఉగ్రరూపము, రాక్షసుల వేధింపులు, అత్యాచారములు ఏమియు కనబడుటలేదు, బాధ అనిపించుట లేదు. అతని మనోనేత్రము ఎదుట, తనలోనూ, అంతటా వెలుగుచున్న నారాయణుడే కనిపించినాడు. పోతనగారి ప్రహ్లాదుడు—

చ. పలువురు దానవుల్ వొడువ బాలునిదేహము లేశమాత్రము
న్నొలియదు, లోపలన్ రుధిర ముబ్బదు, కందదు శల్యసంఘమున్,
నలియదు దృష్టివైభవము, నష్టముగాదు ముఖేందుకాంతియుం
బొలియదు, నూతన శ్రమము పుట్టదు పట్టదు దీనభావమున్. (192 ప)

ఆ రాక్షసులు పెట్టు బాధల కాబాలుడు ఇసుమంతైనను చలించుటలేదు! విచిత్రము !!—

పాఱఁడు లేచి దిక్కులకు, బాహువులొడ్డడు, బంధురాజిలోఁ
దూఱడు, ఘోరకృత్యమని దూఱడు, తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు, మాతృ సంఘము, వసించు సువర్ణ గృహంబులోనికిం
దాఱఁడు, కావరేయనడు, తాపము నొందడు కంటగింపఁడున్. (194 ప.)

ంతేకాదు——

శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపగా
బాలుఁడు నేలపైఁ బడఁడు పాఱఁడు చావఁడు తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరు పక్షము మానితి నంచు బాదముల్
ఫాలము సోక మ్రొక్క డసహాయత నొందుట కేమిహేతువో

(197. ప.)

తండ్రి ఆశించిన మార్పు తనయునిలో రాలేదు. కుమారుని శరీరములో,
ాటలలో, చేష్టలలో ఏ మార్పూ రాకుండుట జూచి హిరణ్యకశిపునిలో పట్టుదల
ంకనూ హెచ్చెను. మరల చెప్పిచూతమని- "ఓరి పగఱ బొగడు పోరామ
మేమిరా, యీ తలంపు విడువు మింకనైన, అవిధినేల బోయెదవు" అని
ఁలుకుచున్న తండ్రికి—— "పయోరుహాక్షుడక్షయు, డచలుం డనంతు
,నిశంబును నా మదిలో నుండగా భయము లేదని" చెప్పిన ప్రహ్లాదుని గని
్త లాభము లేదని తలచి——

). ఒకమాటు దిక్కుంభి యూథంబుఁ దెప్పించి
కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు
నొకమాటు విషభీక రోరగ శ్రేణుల
గడువడి నర్భకుఁ గఱవఁ బంపు
నొకమాటు హేతి సంఘోగ్రానలములోన
విసరి కుమారుని వ్రేయఁ బంపు
నొకమాటు కూలంకషోల్లోల జలధిలో
మొత్తించి బాలకు ముంపఁబంపు

ఆ. విషముఁ బెట్టఁబంపు, విదళింపగా బంపు
దొడ్డ కొండచఱులఁ, ద్రోయబంపుఁ
బట్టికట్టఁ బంపు, బాధింపగా బంపు
బాలు గినిసి దనుజపాలుఁ డధిప.

ఏనుగులచే, సర్పములచే, అగ్నిచే, సాగరముచే, విషాహారముచే కొండలపైనుండి క్రిందికు దొర్లించుటచేతనూ ఫలితములేకపోవుట గమనించి—

సీ. ఒకవేళ నభిచార హోమంబు సేయించు
నొకవేళ నెండల నుండఁ బంచు
నొకవేళ వానల నుపహతి నొందించు
నొకవేళ రంధ్రంబు లుక్కఁబట్టు
నొకవేళ దనమాయ నొందవించి బెగడించు
నొకవేళ మంచున నొంటినిలుపు
నొకవేళ బెనుగాలి కున్ముఖుఁ గావించు
నొకవేళ బాతించు నుర్వియందు

తే. నీరు నన్నంబు నిడనీక నిగ్రహించు
గళల నడిపించు ఱువ్వించు గండశిలల
గదల వ్రేయించు నేయించు ఘనశరములఁ
గొడుకు నొకవేళ నమరారి క్రోధియగుచు. (199 ప.)

ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుడు కూడ తక్కువేమీ కాదు. ఒక స్థితిలో—

క. నోరెత్తితేని యింకను
సైరింపజూమీ దురాత్మ! చలమున నిదె నా
గోరంపు టుక్కు గదఁగొని
బోరునఁ దల వ్రయ్య నడిచి పొరిగొని విడుతున్.
(నృసిం. చతు. 89 ప.)

అని భయపెట్టి, మరల ఎందుకో మనసు మార్చుకొని, తక్షక ప్రభృతులగు భీషణ భుజంగంబులం బిలిచి "'కులదూషకుని' దుర్విషానల జ్వాలా జాలంబులం బ్రేలి పడబొడుపుండని" ఆజ్ఞ ఇస్తాడు.

అప్పుడు——

సీ. కన్నులు జూఱజూఱ గ్రమ్ము మంటల తోడ
మండెడు ఘన ఫణామణులతోడఁ
బొరల దేహమున నిబ్బరపు మ్రొంపుల తోడ
లోలతగ్రాలు నాలుకలతోడఁ
బొదలెడు నాభీల ఫూత్కారములతోడ
నొడవు కెంకల చేర్చు నొడలితోడఁ
మెఱయు నోళ్ళను వెలి కుఱుకు దౌడలతోడ
భుగులును నుగ్రంపుఁ బొడలతోడఁ

గీ. బాపపదువు లదరి పట్టి బాలకుఁజుట్టి
నెఱకులెల్ల దిట్టు గఱచి కఱచి
విసము సల్లి సల్లి మిసిమింతుడునుగాక
యున్న యతని జూచి యుక్కు దక్కి (నృసిం. చతు. 41 ప.)

తక్షకాది భయంకర సర్పంబులు తమ భీషణ ఆకారముతో భయంకర ఫూత్కారములఁతో, ఎన్నిమార్లు కాట్లు వేసిననూ నిశ్చల, నిర్వికల్ప సమాధిలో ఉండి, హరి స్మరణలో మైమరచి ఉన్న బాలున కిసుమంతయు బాధ కలుగలేదు.

తదుపరి బృందారక ద్విరద బృందంబులం బిలిచి తీవ్ర దంతాభిఘాతం బులం జించమని ఆజ్ఞాపింప, ఆ వేదండములు "బొదివి పొడువ నడుమ నడుమ దొడగిననూ పుండరీకాక్షుని మహిమవల్ల ప్రహ్లాదున కేమియూ అపద రాలేదు.

హిరణ్యకశిపుడు ఆపైన అగ్నిలో బడ ద్రోయింప, ప్రహ్లాదుడు 'మేదుర జ్వలన జ్వాలా కలాప దంద హ్యమానుం డగుచునుండియు' 'నఖండ జలధర ధారా సిచ్యమానాంగుఁడు గావున వేఁడిమిం గందక మందస్మితాననుడాయెను.

బాలకుడు అన్ని శిక్షలను అధిగమించుట చూచి, హిరణ్యకశిపుడు వీని తోడి విరోధంబున తనకు మృత్యువు సిద్ధించునేమో యని చింతించుచుండగా, గురువు దగ్గరకు పోయి ——

తే. అవధరింపుము మా పంత మధిప యేము
వదలకీ బాలు శిక్షించు వారమింక
నొయ్య నొయ్యనఁ దెలివికి నోజపఱచి
వెఱ్ఱిదెర్లుము మాటలు వేయునేల (56 ప.)

క. ఈతనికి విష్ణు దెస గం
ప్రీతి విడువ దెలుపు టెంత పెద్ద, యధికరో
షాతురుడై యితఁడలని వి
ఘాతింపను గడఁగు బుద్ధి గఱపెద మోలిన్ (నృసిం. చతు. 57 ప.)

ఈ బాలుని విష్ణువుకు విముఖుని చేసి సరియగు మార్గమున నడిపించెద మని మాట యిచ్చి వెంట గైకొనిపోయిరి.

శా. శుభ్రఖ్యాతివి నీ ప్రతాపము మహోద్యంబు దైత్యేంద్ర! రో
షభ్రూయుగ్మ విజృంభణంబున దిగీశ వ్రాతముం చోరులన్
విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా! విశ్వంబు, వీడెంతఁ యీ
దభ్రోక్తుల్ గుణదోష దూరములు చింతంబొంద నీకేటికిన్?

అని పోతనగారి చండామార్కులు హిరణ్యకశిపునకు ధైర్యము చెప్పిరి. బాలుని మాటలు లెక్కచేయదగినవికావు అని నచ్చచెప్పిరి. ప్రహ్లాదుని తమ వెంట ఆశ్రమమునకు తోడ్కొని పోయి, అతనిని హరి విముఖుని జేయుటకై తీవ్ర ప్రయత్నములు చేయసాగిరి.

ఒకనాడు, గురువులు ఇంటలేని వేళ...తోటి మిత్రులను చేరపిలచి :

క. చెప్పఁడొక చదువు మంచిది
చెప్పెడి దగులములు సెవులు సిందఱగొనగాఁ
జెప్పెడు మన యెడ నొజ్జలు,
సెప్పెదనొక చదువు వినుడు చిత్తము లలరన్. (భాగ. 210 ప.)

ఆత్మోజ్జీవమునకు హేతువై, మోక్షదాయకమైన చదువు చెప్పక మన గురువర్యులు బంధహేతువులైన విద్యలు నేర్పుచున్నారు.

క. వినరయ్య యేను జెప్పెద
ననుపమ తత్త్వార్థమైన యాత్మ హితంబున్
మనమున మా కొక్కొయి
ట్లని చెప్పెడు నిప్పుడీతడని చూడకుడీ! (నృసిం. చతు. 60 ప.)

ఆత్మకు హితమైన చదువు నేను చెప్పెదను, వినండి అని—

ఆ. పుట్టు పెరుగుఁ బ్రాయముల జాల జెన్నొంది
ముదిమిచేతఁ జిక్కిపిదప జచ్చుఁ
బురుషుఁడట్టి దెసలఁ బొందుటదృష్టంబు
యిందు లేదు గాదె సందియంబు. (61 ప.)

క. చచ్చిన జీవుడు గ్రమ్మఱ
వచ్చున్ బుట్టువున కనుట పాయముగా దీ
యచ్చు మునులు శ్రుతి జలముల
దచ్చి కనిన తెలివిగాన తప్పనిదదియున్. (62 ప.)

ఆ. కారణంబు లేక గలుగదు జన్మంబు
కారణంబు పూర్వపుణ్యఫలము
కాన యుక్తియుక్తమైనది యిదియుఁ బ్ర
త్యక్ష మెట్ల యట్ల యనఘులార!

మిత్రులారా! పుణ్యాత్ములారా! మానవ జీవితములో కలుగు వివిధ దశల లోనూ హరిభక్తి యుండవలె. బాల్యమునుండియు శాశ్వత సుఖమునకై తెలివితో ప్రయత్నించవలె. చావు పుట్టుకలు అనివార్యములు. తను, పూర్వజన్మలో చేసిన కర్మలనుసరించే జీవి శరీరము ధరించి సుఖదుఃఖములనుభవించును. నిజమాలో చించిన తల్లి గర్భములో నున్నపుడే జీవికి సుఖము లభించును.

క. తలపోయ తల్లికడుపున
నొలసిన నరు గొంతకాల మునికియు లోకం
బుల కెల్లదృష్ట మత్తఱిఁ
గలుగు నిరోధంబు శాంతగతి గొన బొసగున్. (64 ప.)

అంతియేకాదు—

క. మదురువు గొని యొడలెఱుగక
మదాకుల మనస్కుడయిన మానవునకు నిం
పొదవియు బిడికిళ్ళం గొని
చదియఁ బొడుచునేని యదియు సౌఖ్యంబగునే? (68 ప.)

ఈ కారణము వలననే—

క. కావున కేవల సుఖదం
బే వస్తువు లేదు వినరె యిదె సంస్మృతి నై
యే విధి సుఖదము దుఃఖద
మై వెస దుఃఖమును సుఖదమై తిరుగబడున్ (69 ప.)

మిత్రులారా! సుఖదుఃఖములు ప్రతి మానవుని జీవితములోనూ అనుభవమునకు వచ్చును. కేవలము సుఖదాయకమైనదిగాని, కేవలము దుఃఖకారియైనదిగాని ఏదియూ లేదు. ఒక్కొక్కప్పుడు సూర్యుడు మేఘములను కప్పివేయును, మరొక్కప్పుడు మేఘములు సూర్యుని మూసివేయును గదా! చీకటి వెలుతురు వలెనే సుఖదుఃఖములు కలుగును. ఒక్కొక్కతరి సుఖమనుకున్నది దుఃఖమును కలిగించును. దుఃఖము కలిగించునది సుఖమును అందించును.

మిత్రులారా! ఈ శరీరము నమ్మదగినదిగాదు.

చ. మృగమద చందనాద్యనుపమేయ సుఖోచిత సార వస్తువుల్
దగ గఫవాత పైత్య కలితంబగు కీడుల ప్రోకయైన యా
యగుణ శరీరముం గదిసినంతన దుష్టత బొందు మేలుఁ గీ
డుగ నొనరించు నీ ముఱికి డొక్క మనంబున నమ్మ బాడియే? (70 ప )

ఆ. ఆలుబిడ్డ లిండ్లు నర్థంబుఁ జెలులును
ప్రోపు గూడబెట్టి పొదలు కుమతి
యవియ పిదప జెడగ నన్నింటిఁ దగిలిన
మనసు నుడుపలేక మడిసిపోవు. (72 ప.)

మనిషి ఆశాపరుడు, అత్యాశాపరుడు, దురాశాపరుడు గూడ. తనకోసమై ఎన్నియో వస్తువులను కూడబెట్టుకొనును. కాని అవన్నియు పోయిననాడు తట్టుకోలేక, వ్యథార్తుడై మరణమును కూడ పొందును.

ఈలాగున మాయచే, అజ్ఞానముచే, స్వార్థముచే, సుఖములు అని భ్రమింపజేయు దుఃఖములచే నిండివున్న సంసారము నుండి కడతేరవలెనన్న-

నెమ్మనయుం బొదలు నీ భవవారిధి నిస్తరింపగా
యుంగ వేఱొకటి దెల్లము చెప్పగ లేదు, చెప్పెదన్
ంకాత్మ నిక్కముగ నమ్ముడు విష్ణుననంతు నాద్యుల
గొల్వ దవ్విభుడు చేకొని కాచు నిజైకచిత్తులన్. (78 ప.)

నమ్మినవారిని తప్పక గాచువాడు. కరుణాసముద్రుడు ఆ లక్ష్మీ
రక్ష. ఆతనినే నమ్ముడు. ఇతర ఉపాయములు, సాధనములు
డు. హరిని నమ్మి చెడినవారు లేరు.

కుడు సంసారము
ర్పుఁడు శౌరిచరణ కమలము లెద్దం
కు డూరక కాలము
ండి వివేక వీథి గడగుఁడు నడవన్. (నృసిం. చతు. 74 ప.)

ు అమూల్యము. దానికి వృథా పరచక, సదా ఆ గోవిందుని
లను ధ్యానించుడు. ఆతని చరణములే మనకు శరణములు.
ల ననుసరించి చెడిపోకుడు' అని తన మిత్రుల కుపదేశించెను.

కములోని ప్రహ్లాదుడు—

లార! రండు మన ప్రాయపు బాలురు కొందఱుర్విపైఁ
ు గంటిరే! గురుడు క్రూరు డనర్థ చయంబునందు దు
నర్థకల్పనముఁ జేసెడి గ్రాహ్యము గాదు శాస్త్రమున్
గించెదన్ వినిన మీకు నిరంతర భద్రమయ్యెడిన్.

ారా! రండు. మేలు కలిగెడి హితవు చెప్పెదను. మీరు నా మాట
నిరంతరము భద్రమగును. గురుని ఉపదేశములు అనర్థ
ఆచరణకయోగ్యములు. 'దుర్లభమైన మానవ జీవితములో సగ
ది వ్యవహారములలో, కొంత బాల కైశోర, కౌమారాదులలో, కొంత
ప ములో, అరిషడ్వర్గముల విశృంఖల విహారములో కొంత, ఈషణ
కొంత గడచిపోవును. దుఃఖములు కోరకున్ననూ ఎటుల లభించునో,
డ కాలానుసారముగా మనకు లభించును. వృథాప్రయాసంబున
ర్వ్యయము జేయక, నిరంతరము హరిభజన సేయవలయును.

హరిభజనంబునవే మోక్షము సిద్ధించును. కాని ఇది ఎరుగక మోహాంధుడై మూఢత్వముతో తన, పర భేదముతో మానవుడు కష్టములు కొని తెచ్చుకొని, తుదకు అధోగతి పొందుచున్నాడు.

సీ. బాలుడ నేనిప్డు బాలోచిత క్రీడ
అనుభవించెద మతి యౌవనమున
నెఱవాది నై ధర్మమెఱిఁగి చేసెదఁగాక
యని పోవు నటపోయి యౌవనమున
సుఖముల చవిఁ జొక్కుఁ జొక్కియున్నది గదా
ముదిమి ధర్మమునెల్ల నొదువఁజేయు
నని చనుఁ జని వృద్ధుఁడై యౌవనమునంద
జెన్నాంద ధర్మంబు చేయనైతి

గీ. నేమి సేయుదుఁ గాలుచే యించుకయును
వశముగాదు చిత్తంబు తామసము గప్పె
ననుచునట తాను బొలియు నట్లాత్మహితము
సేయ నబ్బదెప్పుడు మూఢచేతసునకు.

ఎట్టిన మూఢుని చిత్తవృత్తిని, ఆలోచనా సరళిని, అలసత్వాన్ని ఈ సీస పద్యములో చక్కగా వివరించి చెప్పాడు. మానవుడు ఏ విధంగా తన అమూల్యమైన కాలాన్ని హరి భజనలో, ముక్తి సాధనలో గడపక ఏ విధముగా బాల్య, యౌవన, వృద్ధాప్యములను వృధా చేయునో వివరించుచూ 'విష్ణుమయ పుణ్య సమాహిత తత్త్వ చింతకున్ దేవఁయు'నని 'భావన నన్య ముల్లమున బట్ట' నీయకుడని హితవు చెప్పుచూ, సర్వశరీరములందు నాత్మయై ఉన్న శ్రీహరిని మెప్పించవలెనన్న 'సర్వ భూతదయ గాడిలి గావలయున'ని 'జీవులకు నొక్క కీడును సేయదగదని', 'వైరమువలన వైరము పెరుగు'నని, 'దుస్స్వభావ సంజనితమైన' భేద బుద్ధి తొలగించుకొని 'విష్ణునఖిల భావములందు వెదకి గాంచి' ఆనయము సుఖము పొందుదమని, గాలి, సూర్యుడు, వెన్నెల, అగ్ని, మేఘము, వర్షము, సిద్ధియక్ష గరుడోరగామర గంధర్వ కిన్నర నరమృగాదుల చేతగాని, ఏ రోగముచేతగాని, మద మత్సరాదులచేతగాని ఏ విధమైన హాని, అపకారము పొందనటువంటి ఆనంద తత్త్వమును, హరిభక్తుడు పొందగలడు' అని

ప్రహ్లాదుడు పరిపరి విధముల తన స్నేహితులకు బోధించెను. కాని మూర్ఖులై అజ్ఞానవర్తులైన ఆ బాలురు "పుట్టతో బుట్టిన బుద్ధి పుడకలతో"గాని పోనట్లు హరి విముఖతను, దానవత్వమును, హింసాప్రవృత్తిని విడనాడక, దైత్యేశుడైన హిరణ్యకశిపునకు ప్రహ్లాదుని బోధనలను గూర్చి ఫిర్యాదు చేసిరి." ఇది ఎఱ్ఱనగారి వర్ణనము.

పోతనగారి ప్రహ్లాదునిద్వారా సదుపదేశమును, హరి మహిమలను, విశ్వవ్యాపకత్వమును, అఘటిత ఘటనా సామర్థ్యమును విని, ఆశ్చర్యచకితులై ఇట్లనిరి :

ఉ. మంటిమి గూడి, భార్గవ కుమారకులొద్ద ననేక శాస్త్రముల్
వింటిమి, లేడు సద్గురుడు, వేఱొకడెన్నడు, రాజశాల ము
క్కంటికి నైన రాదు సొరగా, వెలికిం జనరాదు, నీకు ని
ష్కంటక వృత్తి నెవ్వఁడు ప్రగల్భుడు సెప్పగుణాఢ్య చెప్పుమా?

క. సేవింతుము నిన్నెప్పుడు
భావింతుము రాజవనుచు బహుమానములం
గావింతుము తెలియము నీ
కీ వింతమతి ప్రకాశ మేక్రియఁ గలిగెన్! (భాగ. సప్త. 221 ప.)

'మనము కలిసి మెలసి బ్రతికితిమి, గురువుఁవొద్ద కలసి అనేక శాస్త్రములు నేర్చుకొంటిమి మన గురువువంటి గురుడు వేరొకడు లేడు. రాజమందిరమా పోతుటీగైననూ చొరరానిది ఇటువంటి స్థితిలో నీకు ఈ జ్ఞానము నెవ్వరుపదేశించిరి? నిన్ను మేము రాజుగ భావింతుము. నిన్ను సేవింతుము. నీకీ వింతబుద్ధి ఏ విధముగ కలిగినది?' అని తోటి బాలురు ప్రశ్నింపగా, ప్రహ్లాదుడు తన తండ్రి తపముజేయు సమయమున దేవతలు అసురులపై దాడి వెడలుట,

మత్తకోకిలము.

ప్రల్లదంబున వేల్పులుద్ధతిఁ బాఱి రాజనివాసముం
గొల్లపెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొనిపోవగా
నిల్లునొచ్చి విశంకులై యమరేశ్వరుండదలిచి మా
తల్లి దాఁజెఱబట్టి సిగ్గునఁ దప్తయై విలపింపగాన్ (225 ప.)

గర్భవతియగు తన తల్లి లీలావతిని ఇంద్రుడు చెఱపట్టుటయు, అంత దైవయోగంబున నారదుడటువచ్చి 'ఆ వేల్పురేనికి', ఆమె గర్భమున నున్నది 'ప్రశస్త భాగవతుడని, అచ్యుత పాదభక్తి మహిమా విష్టుడని చెప్పగా విని అతని వచనము విని తానును హరిభక్తుడు అగుటచేసి ఆమెను విడిచి వెళ్ళుటయు, ఆమెను నారదముని తన ఆశ్రమమునకు తోడ్కొని వెళ్ళి, పుత్రికా భావంబున ఆశ్రయము నిచ్చుటయు, గర్భస్థుడైన తనకు ధర్మ తత్వంబును, నిర్మల జ్ఞానంబును ఉపదేశించిన విధమును తెలియజేసెను. ఆ జ్ఞానసారమిది:-
"ఆత్మకు జన్మ సంస్థాన వర్థ నాపచాయ క్షీణత్వ పరిపాక నాశనంబులు లేవు. ఆత్మ నిత్యుడు, క్షయరహితుడు, వికార రహితుడు, శుద్ధుడు, నిరాకార, నిరంజనుడు. ఆత్మ అవస్థారహితము."

సీ. సంసారమిది బుద్ధి, సాధ్యము గుణకర్మ
గణబద్ధ మజ్ఞాన కారణంబు
గలవంటి దింతియ కాని నిక్కముగాదు
సర్వార్థములు మన స్సంభవములు
స్వప్న జాగరములు సమములు గుణహీన్యు
డగు పరమునికి, గుణాశ్రయమున
భవ వినాశంబులు పాటిల్లినట్లుండు
బట్టి చూచిన లేవు బాలులార!

తే. కడిగి త్రిగుణాత్మకములైన కర్మములకు
జనకమై వచ్చు నజ్ఞాన సముదయమును
ఘనతరజ్ఞాన వహ్నిచే గాల్చి పుచ్చి
కర్మవిరహితులై హరిఁ గనుట మేలు. (భాగ. సప్త 238 ప)

అందువలన అజ్ఞానము తొలగించుకొని, వైకుంఠ చరణకమలధ్యానము నలవరచుకొని, భాగవత ధర్మంబులపై రతిగలిగి, సర్వ భూతములందు ఆ హరిని దర్శించుచూ, ఇంద్రియ వర్గంబును బంధించి భక్తి చేయవలెను. పురుషుండు దేహంబుకొఱకు భోగంబుల నపేక్షించును. దేహంబు నిత్యము కాదు, తోడుగా రాదు. నిష్కాములై హృదయగతుండయిన హరిని నిజభక్తిని భజింప వలయును.

ఁడు వ్రతములఁ గ్రతువుల
ఁడు దానముల శౌచ శీలతపములం
ఁడు యు_క్తిని; భ_క్తిని
ఁన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ! (243 ప.)

దు భూదేవత్వము
దు దేవత్వ మధిక కాంతత్వంబుం
దు హరి మెప్పింప వి
కార్యములార! భ_క్తి సావినభంగిన్. (244 ప.)

లాండ కోటి బ్రహ్మాండ నాయకుడు, అవక్ర విక్రమ పరాక్రముడు
క్తితోనే వశుడౌతాడు ము_క్తి సామ్రాజ్యములోకి ప్రవేశించడానికి
ఱులూ, అన్ని జాతుల వారూ అర్హులే.

జ భుజగ యక్ష దైత్య మృగాభీర
రీ విహంగ శూద్ర శబరు
పాపజీవు లైన ము_క్తికిఁ బోదు
జగము విష్ణు డనుచుఁ దలఁచి. (245 ప.)

సులైననూ, సర్పములైనను, యక్ష, మృగ, విహగ, శూద్రశరుడు
వులైననూ 'విష్ణుడ'ని స్మరించినంత మాత్రముననే ము_క్తిని పొందె
వలన—

దము మనము హరి రతిఁ
ద మేప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
దము దనుజ సంగతి
దుము ముకుంద భ_క్త కోటిన్ సూటిన్.

మని ప్రభావము తోటి బాలకులపై బడినది. వారు కూడ శిక్ష
దువులు చాలించి, నారాయణుని ఎడల భ_క్తిని ప్రకటించుచు
నుసరించుచుండగా, యది గమనించి శుక్రాచార్య కుమారులైన
ండామార్కులవారు హిరణ్యకశిపుని జేరి—

శా. రక్షోబాలుర నెల్ల నీ కొడుకు సేరం జీరి లోలోన నా
శిక్షా మార్గములెల్ల గల్లలని యాక్షేపించి తానందరన్
మోక్షాయత్తులఁ జేసినాడు మనకున్ మోసంబు వాటిల్లె నీ
దక్షత్వంబునఁ జక్క జేయవలయున్ దైతేయ వంశాగ్రణీ!

క. చొక్కపు రక్కసి కులమున
వెక్కురు జన్మించినాడు విష్ణునియందున్
నిక్కపు మక్కువ విడువం
డెక్కటి సుతుగంటి రాక్షసేశ్వర! వెఱ్ఱిన్ (భాగ. సప్త. 264 ప.)

'మహారాజా! నీ కుమారుడు, ఇతర దైత్య కుమారుల జేరి నా విద్యా విధానములు దోష భూయిష్టమని చెప్పి, అందరిని మోక్షోన్ముఖులగ జేసినాడు. మన కులమున వికృతుడైన నీ కుమారుని జన్మతో అరిష్టము వాటిల్లినది. విష్ణుని యెడల ప్రీతి విడువని ఈ సుతుని ఎటుల కన్నావయ్యా!' అని అధిక్షేపించిరి. అది విని హిరణ్యకశిపుడు——

ఆ. తాను చెడుట గాక తక్కినవారిని
జెఱుపఁ జూచె నౌర గొఱకు పడుచు
వీని నెట్లయైన విసువక పొలియింప
వలయునేమి వెరవు గలదొ యింక. (నృసిం. చతు. - 86 ప.)

కూసే గార్దభము, మేయు గార్ధభములను పాడుచేసినట్లును, తాదెద్దకోతి వనమెల్ల చెరచినట్లును, ఈ అర్భకుడు తాను చెడుటయేగాక తక్కినవారిని చెడ గొట్టుచున్నాడే! వీనిని వెంటనే నివారింపవలె. లేనిచో ముందుముందేమి జరుగునో యని చింతించి, వంటవారిని పిలచి, రహస్యయత్నంబున ప్రహ్లాదుని భక్ష్య భోజ్యాదులయందు హాలాహలమును ప్రయోగించమని ఆజ్ఞాపించగా—

చ. అమృతు ననంతు నచ్యుతుని నాత్మ దిరంబుగ నున్చి నిత్య బో
ధనమునఁ గరంగు నప్పరము ధార్మికుఁ డింపుగ నారగిందు న
య్యమిత హాలాహలాద్భుత విషానల సంచయ భక్షణంబునం
దమృతముకంటెఁ బ్రీతికరమయ్యెఁ దఽదంతర బాహ్యచేష్టలన్.
(నృసిం. చతు. 88 ప.)

తన అంతరంగమునందు హరిని నిలుపుకున్న కారణముచే ఆ హాలాహలము ప్రహ్లాదునకు అమృత సమానమయ్యెను. విషప్రయోగము విఫలమయ్యెను.

పోతనగారి హిరణ్యకశిపుడు గురుపుత్రుని ద్వారా తన కుమారుని వింత ప్రవర్తన విని, సహింపలేక, క్రోధోన్మత్తుడై -

సీ. అస్మదీయంబగు నాదేశమునఁ గాని
 మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు
నన్ని కాలములందు ననుకూలుడై గాని
 విద్వేషియై గాలి వీవ వెఱచు
మత్ప్రతాపానల మందీకృతార్చియై
 విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు
నతిశాతయైన నాయాజ్ఞ నుల్లంఘించి
 శమనుండు ప్రాణుల జంప వెఱచు

తే. నింద్రు డాదల నామ్రోల నెత్త వెఱచు
 సమర కిన్నర గంధర్వ యక్ష విహగ
నాగ విద్యాధరావలి నాకు వెరచు
 నేల వెఱవవు పలుక! నీకేది దిక్కు?

(భాగ. సప్త. 257 ప.)

బాలుని జడిపింప నుద్దేశించి, తనెంత గొప్పవాడో, తన మాటన్న యెంత ...లువైనదో, తన శాసనమునను వెఱచి సూర్యుడు, పవనుడు, అనలుడు, యముడు, దేవేంద్రాదులు ఏరీతి భయభ్రాంతులై, కనుసన్నల మెలగుచుందురో ...వరించి, నాకేల నీవు భయపడవు? ఎవడురా నీకు దిక్కు? ఎవరి అండతో నీవి... ధముగ ప్రవర్తిల్లుచున్నావు అని ప్రశ్నించి—

దిక్కులు గెలచితి నన్నియు
దిక్కెవ్వడు రోరి! నీకు, దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేతొక
దిక్కెఱుఁగక కొలుతురితడె దిక్కని నన్నున్.

(భాగ. సప్త. 261 ప.)

అందరికీ దిక్కైన నన్ను కాదని ఎవరిదిక్కు చూచుకొని నిక్కుచున్నావు?

క. బలవంతుడనే జగముల
బలములతో జనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని
బలమున నాడెదవు నాకు బ్రతివీరుడవై (భాగ. సప్త. 262 ప.)

నా బలము నీకు తెలియదు. మహా బలులనెందరినో జయించిన నన్ను కాదని ఎవరి బలమును చూసుకొని, నాకు విరోధిగా మారితివి? అని గద్దించి అడుగసాగెను.

ఎట్టకే గారి హిరణ్యకశిపుడు హతాశుడై మరల గురువులను పిలిచి ప్రహ్లాదుని అప్పగించెను.

గురువులు బాలుని తమ ఆశ్రమమును గొనిపోయి,

తే. ఇట్టి తండ్రి కడుపును బుట్టి నీకు
నొరుల జేర నేల యితని యుల్లమునకు
నొచ్చు తెఱగున మెలఁగెడు వాడవైన
నితని రాజ్యంబు నీదకా కెవ్వరి దగు? (నృసిం. చతు. 98 ప.)

క. దేవుండు వాసుదేవుడు
దేవోత్తముఁ డంచు నేల దేకువ సెడితో
దేవుడు గీవుఁడు దక్కన
దేవతలును నెంతవారు దితిసూనునకున్? (నృసిం. చతు. 86 ప.)

"హిరణ్యకశిపు వంటటి వాడికి పుత్రుడైయుండి, ఇతరుల ప్రాపకము కై ఎందుకీ ప్రాకులాట? ఆయనకు నచ్చునటుల నడచుకొనుము. ఈ సామ్రాజ్యము నీకు తప్ప ఇతరులకేల చెందును? హరిహరాదులు యెవరైననూ నీ తండ్రికి సాటికారు. గాన హరిభక్తి విడనాడు"మని బోధించుచున్న గురువులను జూసి—

"మీరు చెప్పిన యట్ల మేదినీ సురకులంబున బుట్టు తండ్రి పంపన ఘనంబు," అటులనే 'మీరరయ మాకు నాచార్యులరు మిమ్ము నతకరించుట దోసమైనను ఒక మాట చెప్పవలసి వచ్చుచున్నది :

సీ. మన కంటెఁ బెద్దలు ఘనబోధయుతులు ద
క్షాదులున్ వసిష్ఠాదుల వల
నత్రిపులస్త్యాదులట మఱి వ్యాసులు
వెఱ్ఱులై కొలిచిరె విష్ణుదేవుఁ
గొందరు ధర్మంబు గోరి భజింపంగఁ
గొంద ఱర్థము మదిఁ గోరి కొలువఁ
గొందరు కామంబు గోరి సేవింపంగఁ
గొందరు మోక్షంబుఁగోరి తెలియ

గీ. నిందఱకును సేవ్యుఁ డే వేలుపొక్క ప
ద్మాక్షుఁడజుఁ డనంతుఁ డప్రమేయుఁ
డచ్యుతుఁడు పురాణుఁడను నొక్కరుఁడుగాక
వెండి దైవమనగ నొండుగలఁడె? (నృసిం. చతు. 100 ప.)

'గురువర్యులారా! మనకంటె పెద్దలు దక్ష, వసిష్ఠాదులు, అత్రి, పులస్త్య, వ్యాసాదులు విష్ణుదేవుని కొలచినారుగద! వారేమైన వెఱ్ఱివారా? ధర్మార్థులై కొందరు, అర్థార్థులై కొందరు, కామార్థులై కొందరు, మరికొందరు మోక్షార్థులై హరిని సేవించి తమ ఇష్టకామ్య సిద్ధులైనారే! పురాణ పురుషుడైన ఆ హరి తక్క వేరు దైవంబు గలడా?" అని ప్రశ్నించెను.

తే. హరియొకండ జగత్కర్త యఖిల భర్త
విశ్వ సంహర్త భోక్త వివేకయోక్త
తలపు బలపును గొలుపును దెలుపునతని
దెసన కావింపనగు నొండు దిక్కు వోక. (నృసిం. చతు. 103 ప.)

హరి ఒక్కడే కర్త-భర్త, సంహర్త. అతడే సృష్టి, స్థితి, లయకారకుడు అని ప్రహ్లాదుడు ఎలుగెత్తి చాటెను.

తన బలము గురించి దంబముగా పలికిన తండ్రి నుద్దేశించి పోతనగారి ప్రహ్లాదుడు :—

క. బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టి విభుడు బలమసురేంద్రా! (భాగ. సప్త 264 ప.)

'సమస్త ప్రాణికోటికి బలము నిచ్చువాడే నాకు బలము. దిక్కు లేని వారికి దిక్కయ్యెడు వాడు నాకు దిక్కు తండ్రీ! చిత్తమును నీకు వశముగా జేసుకొనుము. మదయుతాసుర భావంబు విడనాడుము.'

ఉ. లోకములన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రియా
నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకర శత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేయుము ప్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు, నేర్పునఁ జూడుము దానవేశ్వరా! (267 ప.)

'తండ్రీ! లోకములన్నియు జయించిన నీవు, నీ ఇంద్రియములను గెలువ వైతివి. నిన్ను బంధితుని చేసి అధోగతి కలిగించు అరిషడ్వర్గములను ఓడించిన, లోకములో నీకు విరోధియను వాడే ఉండడు' అని పలికిన ప్రహ్లాదుని జూచి, హుంకరించి నిందించసాగెను.

'ఖలుఁడేమి యెఱుంగు మహోపకారముల'ని నిందించుచు—

క. ఇంక నిటమీద మాతో
వంకల పదురులును నాడు వాడవయగుమీ
జంకెల పని లేదిదె నిను
గొంకరవో నడచు కృత్య గొల్చెదము వెసన్ (నృసిం. చతు. 108 ప.)

ఇక వాదనలతో పనిలేదు. నిన్ను వధింప 'కృత్య'ను పంపుచున్నాను. అది నిన్ను భక్షించును. ఆ హరి నెన్నిట్లు రక్షించునో చూచెదము గాక! అని కృత్య నుత్పాదించి ప్రహ్లాదునిపైకి పంపిరి.

కాని విష్ణుమహిమవలన—

వ. ఘనకులిశోల్లసత్కఠిన గాఢ శరీరు గుమారుఁ జెంది యా
బినుగు పిశాచికైదు వాక బెండునుబోలె నిమేష మాత్రలోఁ
దునిసి తొలంగి నేలబడి తుత్తుమురై పెనుబుగ్గి గ్రుంగె గ్రుం
గిన గనిభీతి మైమఱలేఁ గృత్య యకృత్య నికృంత గర్వయై. (115 ప.)

ఆ కృత్య యాటలు బాలకునిముందు సాగలేదు. ఒక్క క్షణములో దాని గర్వము సర్వము ఖర్వమైనది. బెండువోలె నేలబడినది. అంతటితో ముగియ లేదు. అది ఎదురు తిరిగి, ఘోరానల జ్వాలారూపమున ఆ మహీసురులను బాధించసాగినది. అది గమనించి ప్రహ్లాదుడు వారిపై కరుణగొని, వారిని రక్షించ మని హరిని ప్రార్థించెను. దానితో ఆ గురువుల మోహము తొలగిపోయెను. వారి అజ్ఞానము అంతరించగా, ప్రహ్లాదుని దీవించి, హిరణ్యకశిపుని వద్దకేగి, అంతయు వివరించి చెప్పిరి. అది విని హిరణ్యకశిపుడు ఆశ్చర్యపడి కొడుకును తన చెంతకు రప్పించి—

క. మంత్రబలమొ మాయయొ యీ
తంత్రము సహజంబొ నీకు దనయా! వినసీ
జంత్రమునకు విస్మయపర
తంత్రంబైనది మనంబు తథ్యము చెపుమా!

ఇది మంత్రమా! తంత్రమా! విడమరిచి చెప్పుమని గుచ్చిగుచ్చి అడిగిన, ప్రహ్లాదుడు, జనకుని చరణద్వయంబు సంప్రీతిమెయిన్ దన శిరము సోక నెఱిగి సవినయంబుగ—

తే. అయ్య! యిది మంత్రబలముగా దరయ మాయ
గాదు నోదగు నైజంబు గాదు వినవె
యెవ్వరికి నైన జొప్పడు నిట్టి పేర్మి
యుల్లమున విష్ణుదిరముగా నునిచిరేని. (నృసిం. 125 ప.)

విష్ణువును మనసా, వాచా, కర్మణా స్మరించువారెవరికైనా యీ విధంబుగ ఆపదలు తప్పించుకొనుట సాధ్యమే అని చెప్పిన, క్రోధములో ఒడలు తెలియక, గింకరకోటిని బిల్చి శతయోజనోన్నతము హేమగిరిప్రతిమంబు హర్మ్యమీ, తుది నిలువెక్కి వీనిని త్రోయుడని ఆజ్ఞాపించెను. కింకరులట్లే సేసిరి. ఆ బాలుడు నేలబడువేళ, భూమి దూదిప్రోవువలె మారిపోయెను. బాలుని శరీరమునకు రవ్వంతైనను హాని జరగలేదు. హిరణ్యకశిపుడు అటుపైన శంబరుండను మాయావిని పిలిచి, ప్రహ్లాదుని ఎట్లైన వధింపమని ఆజ్ఞనొసగెను.

తండ్రి హుంకరింపులకు బెదరక, శంకింపక, క్రోధపడక, ఆనందాంతరంగుడై హృదయమున హరిని దలచి నమస్కరించి——

మ. కలడంబోధి, కలండు గాలిఁ, గలఁడాకాశంబునం, గుంభినిం
గల, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గల, డోంకారమునం ద్రిమూర్తుల ద్రిలింగ వ్యక్తులం దంతటం
గలడీశుండు గలండు తండ్రి! వెదకంగానేల యీయాడెన్.

తండ్రీ! సాగరము, పవనము, గగనము, ధరిత్రి, అగ్ని, బగలు, రేయి, తారకలు, చంద్రుడు, ఓంకారము, త్రిమూర్తులు, త్రిలింగవ్యక్తులు - వీటన్నిటియందును ఆ హరియే ఉన్నాడు. ఇక్కడని, అక్కడని ఆయన నన్వేషింప పనిలేదు.

అంతేకాదు——

క. ఇందు గల డందు లేడను
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి! వింటే? (భాగ. సప్త. 274 & 275)

అని పోతనగారి ప్రహ్లాదుడు శ్రీహరి విశ్వవ్యాపకత్వమును తండ్రికి ఎరింగించెను.

'శంబరాసురుడు ప్రహ్లాదుని తుదముట్టించగోరి మాయలు ప్రయోగించగా భక్తవత్సలుడైన శ్రీహరి తన సుదర్శనమును పంపి, వాని ఆటలు కట్టించెను. అంత హిరణ్యకశిపుడు సమీపమున నిలచి ఉన్న సమీరుని పిలిచి, నీ ప్రచండ శక్తితో ప్రాణము తీయుమని ఆజ్ఞాపించెను. సమీరుడు తన శక్తినుపయోగించి బాలకుని శరీరములో వికారము లెన్నియో కల్పించెను.

కాని, శ్రీమన్నారాయణుని కృపచే గాలి ప్రయత్నము లన్నియు గాలిలోనే కలసిపోయెను. ప్రహ్లాదుని శరీరము చెక్కు చెదరదాయెను. ఇక ప్రయోజనము లేదని గ్రహించి హిరణ్యకశిపుడు తన మందిరమునకు పోయెను. బాలుడు గురుగృహంబునకు పోయి నెప్పటివలె విద్యలు నేర్చుచుండెను. గురుడు అతనికి నీతిశాస్త్రములను, సకల తంత్రంబులను చక్కగా బోధించి, ఒక్కనాడు మరల హిరణ్యకశిపుని వద్దకు పోయి బాలుని ప్రగతి గూర్చి తెలియజేసెను.
(నృసిం. చతుర్థ 151, వచనము (భావము)

తండ్రియూ సంతసించి పుత్రుని రావించి, రాజుల కర్తవ్యంబును, హితుల నహితుల, విశ్వాస యవిశ్వాసుల నెఱుగు తెఱంగును శత్రు మర్దన విధానమును చెప్పుమని ప్రశ్నించిన, ప్రహ్లాదుడు 'సామదాన దండో పాయములను వివరించి, ఎవరితో ఎట్లు మసలుకొనవలేనో,ఎవరియందు విశ్వాసముంచవలెనో తెలియజేసి, సకల ప్రాణుల యెడల మిత్రభావముతోనే మెలగవలయునని బోధజేసి,

క. మేనుల కెల్లను జీవుడు
తానే గోవిందు డొకడు తండ్రీ యున్నాఁ
డానికక్రము తన కబ్బెను
గానుపు రిపు మిత్ర మధ్యగణనకు బోలమై.

(నృసిం. చతు. 157 ప.)

తండ్రీ! అన్ని ప్రాణులలోనూ గోవిందుడున్నాడు. హరి నీకును ఆత్మ యుడే. మోహము అజ్ఞానములను వదలి సత్యమును గ్రహించుము. ముక్తికై ప్రయత్నించుము.

క. కావున ముక్తికి యత్నము
గావింపఁగ వలయు సమత గల్గుట గోరం
గావలయు నెప్పుడును స
ద్భావంబున సమత యెవ్విధం బండ్రేనిన్ (164 ప.)

అది విని హిరణ్యకశిపుడు రోషాకలిత చిత్తుడై రాహుకేతువులను రావించి బాలుని చంపుమని ఆజ్ఞాపించిన, వారునూ బాలుని క్రూర భుజంగములతో బంధించి సముద్రములో పడవైచిన.

క. ఘన భుజగశత ఫణావృత
తనుడై బాలుడు పయోధి తరగలమీదన్
బెనుచాప సెజ్జఁ బవడిం
చిన వెన్నుని పాటి యగుచు జెన్నె సలారెన్. (175 ప.)

పాములతో బంధించబడి నీట తేలుచున్న బాలుడు శేషశాయివలె ఎఱ్ఱన గారికి కనిపించినాడు. హిరణ్యకశిపుని కోరిక తీరనేలేదు. అంత అసురుల నందరినీ పిలిపించి,——

సీ. అలుగుల బొడిపించి యహికోటి గఱపించి
        కరులచే ద్రొక్కించి కసలుటగ్ని
ద్రోయించి విషమున దోగిన యన్నంబు
        బెట్టించి కృత్య కొప్పించి, పొడవు
నందుండి వెసదల క్రిందుగా గెడయించి
        క్రూరంపుమాయల కొంకులందుఁ
దపిలించి పవనుచే నివురుంచి యిప్పుడు
        నీ మహాంబోధిలో నిట్టువైచి

గీ. యెట్టు జాలమైతి మీ ఖలు మర్దింప
దాయ యింక మనకు దాన చిక్కె
నూడు కొనగ వైవు డుర్వీధ్రములు దీని
మీద మెలగకుండ మడుకకుండ. (నృసిం. చతు. 178 ప.)

పోతనగారి హిరణ్యకశిపుడు కూడ తను బాలుని శిక్షించిన విధముల గూర్చి ఇట్లు తలపోయసాగెను :

ఉ. ముంచితి వార్ధులన్, గదల మొత్తితి, శైల తటంబులందు ద్రొ
బ్బించితి, శస్త్రరాజి బొడిపించితి, మీద నిభేంద్రపంక్తి తొ
ప్పించితి, ధిక్కరించితి, శపించితి, ఘోర దవాగ్నులందు ద్రో
యించితి, బెక్కుపాట్ల నలయించితి, జావడిదేమి చిత్రమో!
(భాగ. సప్త. 201 ప.)

ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడు చంపుటకై చేసిన ఇతర ప్రయత్నములన్నియు వ్యర్థముకాగా ఒకనాడు సభకు పిలిపించెను. సభలో శుక్రాచార్యుడు కూడ ప్రహ్లాదుని హరి విముఖునిగా చేయ యత్నించి విఫలుడాయెను. వాసుదేవుని యెడల భక్తిని మానుమనువాడు తండ్రిగాడని, వేద విహితమగు విష్ణు ధర్మమునకు గోపించువాడు గురుడుకాడని, హరిసేవ మాన్పించు హితుడు హితుడుగాడని, పరయోగమగు వైష్ణవ జ్ఞానరహితమైన చదువు చదువుగాదని, కేశవుని లీలలకు ఆనందించని బుద్ధి బుద్ధిగాదని, నుతించని నాలుక నాలుకే కాదని చెప్పి——

ఉ. ఊషర బీజముల్, భసితయోజ్య ఘృతంబులు, షండ కన్యకా
న్వేషణముల్, పయోధిగత వృష్టితతుల్, మృగతృష్ణికాంబుగం
డూషలు, దుర్గకానన కతోరిత చంద్రిక లేడ, మూక స
ద్భాషలు విష్ణుమంగళ కథా విముఖాత్ముల దుష్టజన్మముల్.
(నృసిం. పంచ. 24 ప.)

మంగళప్రదమైన విష్ణు కథలను విన వ్యతిరేకించు వారి దుష్ట జన్మలు, ఊసర క్షేత్రములో చల్లిన బీజములు, భస్మములో పోసిన నెయ్యి, నపుంసకుని ద్వారా వధూన్వేషణ, సాగరములో కురియు వర్షము, ఎడారిలో సిరు, అడవి కాసిన వెన్నెల, మూర్ఖులతో మంచి మాటల వంటివే. అనగా వ్యర్థములని అర్థము.

హరికంటె పరము లేదని చెప్పెడు తనయుని చూచి, ఆగ్రహించి దండధరుని అతని చంపిరమ్మని ఆజ్ఞాపించగా, శ్రీహరి అతనిని నిరోధించుటకై తన సేనాధిపతి విష్వక్సేనుని సేనతోసహా పంపెను. ఒక్క క్షణములో దండధరుడు ఓడినవాడై ప్రహ్లాదుని ప్రార్థనచే ప్రాణములు దక్కించుకొని, తను వచ్చినదారి పట్టెను. తిరిగి ప్రహ్లాదుడు తండ్రికడకేగి, కేవలము విష్వక్సేనుని రాకచేతనే నీవింత తత్తరపడితివి, ఇక హరి వచ్చిన నీ గతి యేమౌనో ఆలోచించుకొమ్మనిన వీనిద్వారా విష్ణువు జాడ యెరిగి, వానిపై దాడిచేసి, ఓడించెదనని తలపోసి, తన సభామంటములో ఒక పెద్ద గద్దియపై ఆసీనుడై, ప్రహ్లాదుని రప్పించుకొని, 'నాకు వైరము హరితోనే ఉన్నది, అతడే నిన్నీ విధమున ఆడించుచు, నాతో ప్రత్యక్షముగ పోర భయపడుచున్నాడు. అతడు కనపడిన వదలను' అని చెప్పగా విని ప్రహ్లాదుడు 'దేవతలకూ, మునులకూ, మహాత్ములకూ తెలియనేరని హరిమాయ నీకెట్లు తెలియును? అతడంతటా నిండియున్నాడు. కొందరు తామస భావప్రేరితులై హరితో వైరము దెచ్చుకొని, చెడిపోవుచున్నారు. పూర్వజన్మ సుకృత ఫలితముచేతనే హరిభక్తి కలుగును. సాగరము లింకవచ్చును, కులశైలములు కూలవచ్చును. భూమి బ్రద్దలవవచ్చును. సూర్యచంద్రుల గతి తప్పవచ్చును కాని విష్ణుభక్తులుండుచోటు ఎంతో నిరపాయకరమైనది. ఆనందదాయకమైనది. హరిభక్తుల మహిమలు అనంతములు, అవర్ణనీయములు. వారు స్వర్గమును గాని, బ్రహ్మపదవి గాని, ఏ సంపదలుగాని కోరరు. వారికి కేవలము హరి యందలి నిష్కామ భక్తియే మహాసంపద. అదియే పదివేలు.

మహాభక్తుడైన 'ఆళ్వందార్' అను భక్తుడు తన స్తోత్రములో చెప్పినటుల

'తవదాస్యసుఖైక సంగినాం
భవనేష్వస్త్వపి కీట జన్మమే।
ఇతరావసథేషు మాస్మభూ
దపి మే జన్మ చతుర్ముఖాత్మనా॥'

"ఓ శ్రీమన్నారాయణా! నీ దాసుల సాంగత్యములో నాకు కీటక జన్మ లభించిననూ నాకు ఇష్టమే, కాని ఇతర సుఖములతో కూడిన, నీ చింతన లేనట్టి, బ్రహ్మగా నైననూ నేను జన్మించ నిష్టపడను" — హరి భక్తులు నారాయణ రహితమైన దేదియూ వాంఛింపరు. వారలకు—

క. విష్ణుమయము వేదంబులు
విష్ణుమయము సర్గమఖిల విజ్ఞానములున్
విష్ణుమయము జపమంతయు
విష్ణుమయము విష్ణు డొకడ వేద్యుడు బుద్ధిన్. (నృసి. పంచ. 59 ప.)

అని యీ విధమున ప్రహ్లాదుడు హరిని, హరిమహిమలను విస్తారముగా వర్ణించి,

క. ఎఱిగిన వారికి నెందును
గుఱుకొనితోనుండు దన్ను గొనకుండెడు వా
యొఱుకులకుఁ జేరువయ్యును
బొఱయందగ డతడు నిఖిల భువనములందున్.

'ఎఱుక' గల వారికి హరి లేని చోటు లేదు. అణువణువులో నిండి ఉన్న హరిని వారు సదా దర్శించుచునే ఉందురు. ఎఱుకలేనివారు హరి చేరువలో యున్ననూ, హరిని యెఱుంగలేక పోవుచున్నారు.

సీ. కలఁడు మేదిని యందుఁ గల డుదకంబుల
గలడుఁ వాయువునందు గలడు వహ్ని
గలఁడు భానుని యందుఁ గలడు సోముని యందుఁ
గల డంబరమునఁ గలడు దిశల
గలఁడు చరంబులఁ గల డచరంబుల
గలఁడు బాహ్యంబునఁ గలఁడు లోనఁ
గలఁడు సారంబులఁ గలఁడు కాలంబుల
గలఁడు ధర్మంబులఁ గలఁడు క్రియల

గీ. గలఁడు కలవాని యందును గలఁడు లేని
వాని యందును గలఁడెల్లవానియందు
నింక వేయును నేల సర్వేశ్వరుండు
కలఁడు నీయందు నాయందుఁ గలఁడు కలఁడు.

'పంచ భూతములందు, సూర్యచంద్రులయందు, చరాచరములందు, అంతర్ బహి ప్రదేశములందు సర్వేశ్వరుడైన హరి నెంకొని ఉన్నా'డన్న మాటలు విని హిరణ్యకశిపుడు కుపితుడై - "ఇందు గల్గునేయని

జగద్వలయ ఘోర కరాహతి వ్రేసె గంబముత్యనుపమ
తత్సభా భవన మల్లలలాడ, గలంగ లోకముల్"—
(నృసిం. పంచ. 80 ప.)

ఆ సభాభవనమున ఉన్న స్తంభమును చూపించి, నీ హరి ఇందునూ గలడా! అని క్రోధముచే స్తంభముపై చేతితో ఒక దెబ్బవేయగా, ఆ దెబ్బకు సభాభవనమంతయు అల్లలాడెను. లోకములన్నియు ఆ ధ్వనికి భీతి చెందెను. ఇక, పోతనగారి హిరణ్యకశిపుడు :

మ. వినరా డింభక! మూఢ చిత్త గరిమన్ విష్ణుండు విశ్వాత్మ కుం
డని భాషించెద, వైన నిందుగలడే, యంచున్ మదోద్రేకియై
దను జేంద్రుం డరచేత వ్రేసెను మహోదగ్ర ప్రభాసంభమున్
జన దృగ్భీషణ దంభమున్ హరిజన స్సంరంభమున్ స్తంభమున్.
(భాగ. సప్త. 284 ప.)

డింభకా? మూఢుడవై నీవు విష్ణువు విశ్వ వ్యాపకుడని తర్కించు చున్నావు! అటులయిన ఈ స్తంభములోనూ ఉన్నాడా నీ హరి? అని తన అరచేత ఆ స్తంభముపై ఒక్క చరుపు చరచగా, ప్రకాశించునదై, చూపరులకు భయము కొల్పునదైన ఆ స్తంభము ఒక్క పెట్టున పెద్ద ధ్వనితో, ఫెళ ఫెళా విరిగి నేలబడి ముక్కలు ముక్కలాయెను.

ఆ స్తంభము పగిలినపుడు వెడలిన ధ్వనికి-

"నాకాశ సకల దేశావకాశ భరితమై విశ్వమును మూర్ఛపాలు పడగా,
భువన కంపంబు గదిరె"నట— (నృసిం, పంచ, 81 ప.)

అమ్మహా స్తంభమున—

విజృంభమాణ జిహ్వాల విస్ఫృత వదన గహ్వర స్ఫురదసహ్య కహకహోత్తర్జన గర్జా స్ఫూరితంబును, వికట కఠోర ఘోర దంష్ట్రా దండదారుణ దహన దందహ్యమాన దశదిశా భాగంబును, విపుల కపిల క్రూర తరల తారకా తరంగితోద్వృత్త వృత్తాయతేక్షి రూక్షర దన స్ఫులింగ పూరిత భువన రంధ్రంబును, నభంగ భ్రూభంగ భయద ఫాలభాగ ప్రాంత భంగుర భ్రమరక దురవలోకనంబును, విశ్వధురంధరస్కంధ పరిణాహ పరిణతోదగ్ర కింజల్క పుంజపింజరిత భాసుర కేసరి ప్రసర ప్రక్షాళితాంతరిక్షంబును, హేమ కమల తంతుకాంతి కోమల రోమవల్లరీ గహన కరాళ కర్ణకోటీర ఘటితకుండలమణి మరీచి మంజరీ రంజిత గండ స్థలోద్భాసితంబునును, వివిధ మణిమయభూషణా భూషితుడును, సర్వాశ్చర్య సంజనితంబును, సర్వలోకాతిరిక్తంబును, సమస్త సాధుజన హృదయ వ్యాపార పరానంద నిష్యందంబును, సమస్త తమోనిరసన ప్రదీపంబునునగు శ్రీ నరసింహరూపం బావిర్భవించెను.

(నృసిం. పంచ. 82 వ.)

చూపరులకు భయంకరాతి భయంకరమై, వ్రేలాడు కేసరములతో, వివిధ మణిమయ ఆభరణమ్ములతో, శిష్టులకు నయనానందకరమ్మై, దుష్టుల గుండెలు బ్రద్దలు చేయునదై, నృసింహమూర్తి ఆవిర్భవించెను.

పోతనగారి నరసింహరూప వర్ణనలో—

'నమ్మహాస్తంభంబువలన బ్రళయవేళా సంభూత సప్త స్కంధ బంధుర సమీరణ సంఘటిత ఘోర రజో ఘుణ్యమాణ మహావలాహక వర్గ నిర్గత నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాత సంఘ నిర్ఘోష నికాశంబులైన ఛట చ్ఛట స్ఫట స్ఫట ధ్వని ప్రముఖ భయంకరారావ పుంజంబులు. జంజన్య మానంబులై యెగసి యాకాశ కుహరాంతరాళంబు నిరవకాశంబుసేసి నిండినం బట్టుసాలక దోధూయ మాన హృదయంబులై పరవశంబులైన పితామహ మహేంద్ర వరుణ వాయు శిఖ ముఖర చరాచర జంతుజాలము తోడ, బ్రహ్మాండ కటాహంబు పగిలి, పరిస్ఫోటితంబుగా, బ్రఫుల్ల పద్మయుగళ సంకాశ భాస్వరచక్ర చాపహల కులిశ జలచర రేఖాంకిత చారుచరణతలుండును, అవర్ణనీయమై, భయమును, విస్మయమును కలిగించువాడును, విభిన్న యాయుధములు ధరించి, నానా భరణములతో

ప్రకాశించువాడును ధవళ ధరాధర దీర్ఘ దురవలోకనీయ దేహుఁడును, ప్రహ్లాద హిరణ్య, కశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీర రస సంయుతుండును మహా ప్రభావుండును నయిన శ్రీ నృసింహ దేవుడు నావిర్భవించెను (భాగ. సప్త. 285 వ.)

క. నరమూర్తిగాదు కేవల
హరిమూర్తియుఁ గాదు మానవాకారముఁ గే
సరి యాకారము నున్నది
హరి మాయారచిత మగు యథార్థము సూడన్. (286 ప.)

స్తంభోద్భూతమైన మూర్తి విచిత్రమై, భయము కల్గించురీతి, సగము నరుడు, సగము సింహాకృతులతో ఉన్నది.

ఆమూర్తిని చూసి :

ఉ. అక్కజమైన యీ నరమృగాకృతి తేజము లోకమంతటన్
బిక్కటిలంగఁ దీవ్రగతిఁ జేర్చి తలర్చినఁ దేరిచూడలేఁ
కెక్కడయుం జనంగ దెలియింపు నెఱుంగక దైత్యుడెంతయున్
జొక్కి మనంబునన్ దిగులు చొచ్చిన జేష్టలడక్కె నత్తఱిన్.
(నృసిం పంచ. 83 ప)

ఆశ్చర్యకరమైన నృసింహరూపును జూసి లోకమంతయు అదరగా, హిరణ్యకశిపుడు తేరిపార చూడలేక, దిగులుతో, భయముతో, చేష్టలుడిగి ఉండెను. అంతట ప్రహ్లాదుడు తండ్రితో, "అతుల తపస్సమాధి నియతాత్ములకైనను గానరాని యద్భుత పరమాత్మమూర్తి యిదెతోచె, ఇక నీ కతలు మాని, యిప్విభు నాశ్రయింపు" మనిన ఆతడు 'రేగి, బేలయేల మాటలు వెలిపింప నన్ను, ఈ మూర్తిని యిప్పుడే సమయించెద'నని యానృసింహామూర్తికి యెదురు నడచెను.

పోతనగారి నరసింహుడు :

సీ. పంచననోద్ధూత పావకి జ్వాలలు
భూనభోంతరమెల్ల బూరితముగ
దంష్ట్రా కురాభీల ధగధగాయిత దీప్తి
నసురేంద్రు నేత్రము లంధములుగఁ

గంట సన్నిభోత్కట కేసరాహతి
నక్షత్ర సంఘము భిన్నమై చలింప
ప్రళయార్క చంచలా ప్రతిమ భాస్వరములై
ఖర నఖరోచులు గ్రమ్ముదేర,

తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహుండా **దితిపట్టి** నధిప! (భాగ. సప్త-291 ప.)

భయంకర రూపముతో వెలుగొందుచూ, గర్జించుచూ, బొమలను బంధించి, నాలుక నాడించుచు హిరణ్యకశిపుని పైకి లంఘించి ఒడిసి పట్టుకొనెను.

ఉ. కీఱలు గీటుచు న్నయన కోణములందహన స్ఫులింగముల్
గాఱగ, గర్జముల్ బిగియగా ఘనకేసరముల్ విదుర్చుచున్,
మీఱిన యుబ్బునన్ బొదలి మీదికి మూరెడు పేర్చి కింకదై
వాఱగ బట్టె బిట్టు **దితిపట్టి** నృసింహుం డసహ్య తీవ్రతన్.
(నృసిం. పంచ. 95. ప.)

ఇరువురు తమ పద్యములలో హిరణ్యకశిపునకు 'దితిపట్టి' యని శబ్దము వాడబడుట గమనించతగినది. నరసింహుడు ఉగ్ర నరసింహుడై ప్రళయకాల రుద్రునివలె హిరణ్యకశిపుని ఒడిసిపట్టి తన యూరువుల జేర్చి నఖసంఘాత ములతో,—

శా. చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిం
ద్రెంచుం గర్కశనాడికా వశులు, భేదించున్ మహావృక్షముం,
ద్రుంచున్ మాంసము సూక్ష్మ ఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించుం, బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై.
(భాగ. సప్త. 295 ప.)

దుష్ట దానవుడైన హిరణ్యకశిపుని గుండెలు చీల్చగా, రక్తము జలజల నేలకారగా, అతని నాడీ మండలములను త్రెంపివైచి, వక్షస్థలమును తుండెలు తుండెలుగా చేసి, ప్రేవులు బయట తీసి కంఠమాలికలుగా ధరించిన నృసింహ మూర్తి భయంకరముగా నుండెను. ఆ సమయమున ఆయన గోళ్ళు ఒకప్పుడు

గొడ్డళ్ళవలె, మఱియొకతరి తవుగోలలవలె, ఇంకొకతరి కొడవండ్లవలె, మరి యింకొక సమయమున అంపములవలె భాసించెను. అంతేకాదు - ఆయన నఖములు :

క. స్ఫురిత విబుధ జన ముఖములు
పరి విదళిత దనుజ నివహ పతితను ముఖముల్
గురు రుచిజిత శిఖి శిఖములు
నరహరి కర నఖములమరు నతజన సఖముల్. (భాగ. సప్త. 298)

కాని, ఎఱ్ఱనగారి నారసింహుడు హిరణ్యకశిపుని బొదివి పట్టి గగనంబున కెగసి, సముత్తుంగ శృంగ సంఘటిత వియత్తలంబగు మహాశైలంబునకు పోయి యచ్చట యాసీనుడై :

చ. అలఘుతరాట్టహాసము లజాండ కటాహము వ్రయ్య భీషణో
జ్జ్వల వికట స్ఫుర త్కులిశ శాత నఖాంకుర తీవ్ర పాతనం
బుల నసురేంద్రు పేరురము బొల్పుఱ జించికలంచి శోణితం
బులు దొరగించె ద్రుంచె బెను ప్రోవులుగా జఱ ప్రేవులుక్కునన్.
(నృసిం. పంచ. 100 ప.)

అంతటితో ఆగలేదు.

ఉ. పెల్లగ దోయిలించుకొని భీషణ దానవ దేహర క్తముల్
వెల్లిగొనంగ సానువుల వెంట మతిన్నరసింహదేవుడున్
జల్లగ నిండు గాలువలు సాగి కరంబు భయంకరంబుగా
నెల్లెడ గ్రొత్తవికావి సెలయేఱుల చెన్నొదవ గూడె నగ్గిరిన్. (102 ప.)

క. నరహరి చల్లిన యసురే
శ్వరు శోణిత శీకరములు వన పంక్తులపై
దొరిగి నిరంతర పల్లవ
విరచిత నూతన వసంత విభ్రమ మొసగెన్. (104 ప.)

తే. వీరనరసింహ దేవుడు ద్వృత్తి బెఱికి
పాఱవైచిన బడియొప్పె పగతుప్రేవు
లసుర సంపద యను కొంత యఱుతనుండి
త్రెస్సి దొరగిన హారంపు దీవెలనగ. (106 ప.)

భీకర అట్టహాసము చేయుచు, వాడి గోళ్ళతో రాక్షసుని గుండె చీల్చి రక్తపుటేరులు ప్రవహింపచేసి ప్రేవులు ముక్కలు ముక్కలు చేసెను. రక్తమును దోసిళ్ళతో తీసి కొండకోనలలో చల్లగా, సెలయేటులు ఎఱ్ఱబారి నిండి పోయెను. వృక్షములన్నిటికి వసంతశోభ వచ్చినట్లనిపించెను. ఆ దానవుని ప్రేగులు పెరికి నేల బడవేయుగా, అసురసంపద అను స్త్రీ మెడలోనుండి త్రెగి నేలబడిన హారపు తీగలవలె భాసిల్లెను.

అంతట నాదిత్యులు నాదిమునులు ప్రహ్లాదునితోగూడి నతివందనములు జేయుచు దోసిలిలు ఘటించి ఆ మహామూర్తిని పరిపరి విధంబుల స్తుతించిరి.

పోతనగారు విరించి మహేశ్వర మహేంద్రాదులను, త్రిదశ కిన్నర కింపురుష పన్నగ సిద్ధ గరుడ గంధర్వ చారణ విద్యాధరులను ప్రజాపతులను కూడ రప్పించి అందరిచేతను వేరువేరుగ స్తుతింపజేసిరి. ఇంద్రుడు, ఋషులు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, భుజంగులు, మనువులు, ప్రజాపతులు, గంధర్వులు, చారణులు, యక్షులు, కింపురుషులు, వైతాళికులు, కిన్నరులు మరియు ఇష్టసేవకులు నారసింహుని ఆర్తత్రాణపరాయణతను, దుష్టశిక్షణ, శిష్ట రక్షణా వ్రతమును, అఘటిత ఘటనా సామర్థ్యమును ధర్మోద్ధరణ లక్ష్యంబును అశేష శేముషీ వైభవమును, మహాపరాక్రమమును, సర్వవ్యాపకత్వమును, పరి పరి విధముల స్తుతించిరి.

ఎఱ్ఱనగారి దండకములో నాదిత్యులు, మునులుగూడ 'అన్తర్ బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' అన్న మంత్రానుసారముగ, నారాయణుని విశ్వవ్యాపిని, ధర్మప్రతిష్ఠాపనా లక్ష్యమును, సత్యప్రియతను, దుర్మార్గులై, సాధుపీడకులై, మానవత్వమును ప్రేమానురాగములను మరచి క్రూర జంతువుల వలె సంచరించువారిఎడల చూపు కాఠిన్యతను, కరుణా వాత్సల్యాది గుణము లను పొగడిరి. అంతవరకు విస్ఫులింగములు కురిపించుచూ, రక్తారుణ కాంతు లతో ఎంతటివారికైననూ భీతి కలిగించిన నారసింహుని కనులు,

క. సిత కమల దళంబులకున్
ప్రతియగు లోచనములందు ప్రబలు ప్రసాద
స్మిత రుచి జాలములు దిశా
ప్రతతిన్ బూర్ణేందురుచుల భంగి వెలంగెన్. (నృసిం. పంచ. 115 ప.

భక్తకవి పోతనగారి భాగవతములో బ్రహ్మ రుద్రాదులు, దేవ దానవ యక్ష, గరుడ, కిన్నర, కింపురుషాదులు, గంధర్వులు, వైతాళికులు మునులు దేవ దేవుని ఎంత నుతించినను ఆయన విజృంభణము, కోపము తగ్గనందున, లక్ష్మీదేవిని పిలిచి,

క. హరికిం బట్టపుదేవివి
హరిసేవా నిపుణమతివి, హరి గతివి సదా
హరి రతివి నీవు సనినర
హరి రోషము డింపవమ్మ హరివరమధ్యా! (భాగ. సప్త. 841 ప.)

అని ప్రార్థించి, నరసింహుని శాంతింప జేయమని కోరిరి. కాని లక్ష్మీ దేవికి కూడ ధైర్యము చాలలేదు.

క. పలికెద నని గమకముఁ గొను,
బలికినఁగడు నలుగు విభుఁడు ప్రతివచనములం
బలుకఁడని నిలుచు శశిముఖి
బలువిడి హృదయమున జనవు భయమును గదురున్. (843 ప.)

లక్ష్మీదేవి నరసింహుని శాంతింపజేయలేక పోవుట గమనించి చతుర్ముఖుడు ప్రహ్లాదుని సమీపించి..-

క. తీంద్రమగు రోషమున మీ
తండ్రి నిమిత్తమున జక్రి దారుణమూర్తిన్
వేంద్రము విడువడు మెల్లన
తండ్రీ! శీతలునిఁ జేసి దయసేయగదే. (845 ప.)

నరసింహుని శాంతింప జేయమని అర్థింపగా, ప్రహ్లాదుడు దేవదేవుని సన్నిధికి వెళ్ళి, సాష్టాంగ దండప్రణామంబు చేసి,

సీ. సత్త్వాకరుఁడ వైన సర్వేశ! నీ యాజ్ఞ
శిరముల నిడుకొని చేయువారు
బ్రహ్మాదు లమరులు భయమందుచున్నారు
నీ భీషణాకృతి నేడు చూచి,

రోషంబు మాను నీ రుచిర విగ్రహములు
        కల్యాణ కరములు గాని భీతి
కరములు గావు లోకములకు వృశ్చిక
        పన్నగంబుల భంగి భయము జేయ

తే. నసుర మర్దించితివి, సాధు హర్షమయ్యె
నవతరించిన పనిదీఱె నలుక యేల
కలుష హారివి సంతోష కారి వనుచు
నిన్ను దలఁతురు లోకులు నిర్మలాత్మ।

మ. ఖర దంష్ట్రా భ్రుకుటీ సటా నఖయు నుగ్ర ధ్వానయున్ రక్త కే
సరయున్ దీర్ఘతరాంత్ర మాలికయు భాస్వన్నేత్రయు నైన నీ
నరసింహాకృతిఁ జూచి నేవెఱవఁ బూర్ణక్రూర దుర్వార దు
ర్భర సంసార దవాగ్నికిన్ వెఱతు నీ పాదాశ్రయుంజేయవే. (౪౮౮ ప.)

"స్వామీ, సత్త్వాకారుడవైన నిన్ను నేడు ఈ రూపమున జూచి బ్రహ్మా దులు భయభ్రాంతులగుచున్నారు. నీ క్రోధమును తగ్గించుకొని యధాపూర్వముగ మందస్మిత వదనారవిందుడవు గమ్ము. నీ సుందరమూర్తులు కల్యాణకరములే గాని భీతి కరములుగావు. దుష్టశిక్షణ అయినదిగదా! ఇంకనూ అలుకయేల? నాకు మాత్రము నీ రూపు వెఱపు కలిగించుటలేదు. సంసార దవాగ్ని మాత్రమే నాకు భీతి కలిగించును. యోగియైనను, తాపసియైనను, వేదవేదాంగవేత్త యైననూ, తత్త్వవేత్తయైననూ నిన్ను జెవులార వినడేని, నీకు సేవ చేయడేని, వాడు బ్రహ్మంబును పొందలేడు. గాన, నీ దాస్య యోగంబును మాకు దయ జేయుమని" ప్రార్థించినాడు.

నరహరి ప్రహ్లాదుని వర్ణనలకు మెచ్చి, రోషము విడిచి, యధాపూర్వక ముగా శాంతుడై, చిరునగవుతో, "సంతోషించితిని. నీ చరిత్రము నాకు ఎంతో ఆనందము కలిగించినది నీ అభీష్టం లీడేరుగాక! నీ మనోవాంఛల నెరిగింపుము" అనిన విని ప్రహ్లాదుడు "దేవా! నీవు వరదుండవేని, నాకు కామములు వృద్ధి బొందని వరమునిమ్ము. తృప్తికి మించినదీ జగమున వేరులేదు"

ప్రహ్లాదుని ప్రత్యుత్తరము విని నరహరి సంతుష్టాంతరంగుడై—

'నీయట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు నన్ను కోర్కెలు కోరరు. నీవు ఈ మన్వంతరమంతయు మంతయు భూలోకము నేలుకొనుము. సకల భోగము లనుభవింపుము, నా కథలు వినుచూ, నాయందు ఆత్మ నిలిపి, కర్మకాండలను ఖండించి, కేవలము భక్తి సాధనలతో ఈశ్వరార్పణముగా జీవనము సాగించుము."

ప్రహ్లాదుడు అంత స్వామితో "అలనాడు నీవు వరాహమవై నా పినతండ్రి చంపిన కారణముననే నా తండ్రి నిన్ను ద్వేషించినాడు. సర్వభూతంబులందు నిన్ను గాంచలేక, ప్రాణికోటిని బాధించినాడు. నీ శాంత దృష్టి పడిన కారణ మున, నీచేత చంపబడిన కారణమున అతడు పవిత్రుడైనాడు. అతని పాప ములను హరించి, ముక్తుని జేయ"మని ప్రార్థించెను. దానికి నరహరి వల్లెయని - 'నిన్నుగనుట చేతనే నీ తండ్రి తన పూర్వములైన త్రిస్సప్తతరముల వారితో కూడ తరించినాడు' అని పలికెను. అంత బ్రహ్మ 'దేవాధిదేవా! వీడు నాచేత వరము పొంది, నా సృష్టిలోని ఏ ప్రాణిచే చంపబడక, నేడు భాగ్యంబున నీ చేత మరణము పొందెను. లోకములకు మంగళమయ్యెను. ఈ బాలుడును రక్షింపబడె'ననిన విని శ్రీ నరహరి, 'ఓ చతుర్ముఖా! ఇకముందు నీవు రక్కసు లకు ఇటువంటి వరముల ప్రసాదించకు'మని హితవు పల్కి అంతర్హితుం డయ్యెను. బ్రహ్మ ప్రహ్లాదునికి పట్టముకట్టి ఆశీర్వదించి తదితర దేవతలతో నిజస్థానమున కరిగెను.

ఎఱ్ఱనగారి నారసింహుడే ప్రహ్లాదుని వీక్షించి నవ్వుచూ—

తే. తండ్రి యుఱక లేమికి విషాదంబు వలదు
కాలగతితోడ నతనికి మేలు గలుగుఁ
బుత్రకత్వంబు లెల్లను బూనినడపు
జనకునకు దద్విభూతియు సంభవించు (నృసిం. పంచ. 117 ప.)

క. దైతేయ రాజ్య విభవ
ఖ్యాతి యెసఁగ నీవు పెద్దకాలము భవ భో
గాతిశయ మనాసక్తుఁడ
వై తగ భుజియించి పొందు మస్మత్పదమున్ (నృసిం.పంచ. 119 ప.)

కుమారా! నీ తండ్రి దుష్టత్వంబునకు, 'ఎఱుక' లేమికి వగవ వలదు. అతనికి మేలు తప్పక కలుగును ఇక నీవు పుత్రకార్యములన్నియు నిర్వహింపుము. రాక్షసరాజ్యమును కలకాలము, నిష్కాముడై - అనాసక్తుడవై ఏలి తుదకు, నన్ను పొందుము" అని చెప్పి - 'నిజమునకు నీ తండ్రి దోషుడు కాడు. శాపగ్రస్తుడు. అతనికి కైవల్యము నేను ప్రసాదింతు'ననిన, ప్రహ్లాదుడు విని ఆహ్లాదము పొందెను. అంతియేకాదు, నరసింహోద్భవము జరిగిన ఆ స్థలము అహోబలనామధేయముతో త్రిభువన పావనమగునని కూడ నరహరి ఆనతిచ్చెను. ఆ మహనీయుని పాదసేవ చేయగోరి మందాకిని కూడ భూమికి దిగివచ్చుట చూచి ప్రహ్లాదాది ప్రముఖులు ప్రస్తుతించిరి.

ఎఱ్ఱనగారి ప్రహ్లాదుడు——

క. ఏ జన్మమున, జనించిన
నా జన్మమునందు నీ సమంచిత చరణాం
భోజంబులపై విగత
వ్యాజమయిన భక్తి భక్తవత్సల! యీవే!

క. ఖలులకు సంసారముపై
గల వేడుకఁ బాపి మోక్షగరిమము గూర్పన్
వెలయవలయు నీ మహిమలు
దలఁపుచు నిట్లున్న నాదు తలఁపున వరదా!

'భక్తవత్సలా! జన్మజన్మలకు నీ చరణారవిందములపై నాకు నిశ్చలమైన భక్తిని ప్రసాదింపుము' అని ప్రహ్లాదుడు నరసింహుని ప్రార్థించెను. మహాభక్తుడు కులశేఖరుడు కూడ ఆ ముకుందుని...'జన్మజన్మాంతరేపి, త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలాభక్తిరస్తు' అని ప్రార్థించాడు. అంతేకాదు- సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై...అను మంత్రానుసారము ప్రహ్లాదుడు సాంసారిక సుఖములలోబడి వాటినే పరమార్థములుగా తలచువారి అజ్ఞానము పోగొట్టి సుజ్ఞానము నొసగి 'మోక్షగరిమ' లభించు విధముగ నీ మహిమలు ప్రకాశించవలెనని నిస్వార్థముగా ప్రార్థించెను నారసింహుడు చిరునవ్వుతో నటులే యని పలికి——

'సీమహనీయ వినిశ్చల చరితంబు సంప్రీతి చదువువారు, ఇతరులకు వినిపించువారు, కల్మషరహితులై ఆయురారోగ్యాలు పొందెద'రని ఆశీర్వదించెను.

పోతన భాగవతమున గూడ, నారదుడు యుధిష్ఠిరునకు ప్రహ్లాద చరిత్ర నంతయు జెప్పి—

> శ్రీ రమణీయమైన నరసింహ విహారము నింద్ర శత్రు సం
> హారము బుణ్య భాగవతుఁడైన నిశాచర నాథ పుత్త్రి సం
> చారము నెవ్వడైన సువిచారత విన్న బఠించినన్ శుభా
> కారముతోడ, నేభయము గల్గని లోకము జెందు భూవరా!

నరసింహ విహారము, హిరణ్యకశిపు సంహారము, భాగవతుడైన ప్రహ్లాదుని చరిత్ర విన్నవారికి, పఠించినవారికి శుభములు కలిగి; అంత్యకాలమున భయరహితమౌ లోకము ప్రాప్తించునని పలికెను.

## ఎఱ్ఱన పోతనల వ్యక్తిత్వ కవితారీతుల తులనాత్మక పరిశీలనము : అసమానతలు

1. నైమిశారణ్యమున రోమ మహర్షుడను పౌరాణికుని, మహర్షులు భూలోకమునగల మహోత్కృష్టమయిన తీర్థ స్థానముగురించి ప్రశ్నించుటయు, దీనికి ప్రత్యుత్తరముగా ఆ మహర్షి అహోబిలముగూర్చి చెప్పుచూ ప్రసంగానుకూలముగా ప్రహ్లాద చరిత్రను వివరించుట, ఎఱ్ఱన నృసింహ పురాణములో సంభవించినది.

హరిని నిరంతరము ద్వేషించు శిశుపాలుడు సుదర్శన చక్రముచే హతుడయిన పిమ్మట అతని ఆత్మవచ్చి శ్రీకృష్ణ పరమాత్మలో లీనమగుట గని వెఱగంది, నిందజేయువారి సాయుజ్య మెటుల లభించినదని ప్రశ్నించిన ధర్మజునకు భక్తిలోని భేదముల నెరిగించుచు వైరభక్తుడైన హిరణ్యాక్ష హిరణ్యకశిపుల గాథ వర్ణించుచు పోతన ప్రహ్లాద చరిత్రను తెలిపెను.

2. ఎఱ్ఱన బ్రహ్మాండ పురాణములోనున్న అల్పమైన కథాంశమును గైకొని, కొంత విష్ణుపురాణములోని అంశమును దానికి జోడించి, మరికొంత తన కల్పనను కలిపి నృసింహపురాణమును రచించెను.

పోతనగారు సంస్కృత భాగవతమును ప్రధానముగా స్వీకరించి దానికి అనువాదము చేయుచు, ఎఱ్ఱనగారి నృసింహపురాణము, శ్రీధరవ్యాఖ్యను కూడ ఆధారముగా మాత్రమే స్వీకరించి, తన సహజ కవితారీతిలో, భక్తిపారవశ్యతను జోడించి ఆంధ్ర మహాభాగవతము రచించినాడు.

3. ఎఱ్ఱన జన్మతః కవి, భావుకత అతని పరివేషము. అతని కవితా శయ్య పుష్పగుంఫితము. హృదయము రస ప్రస్రవణము.

పోతనయు, సహజ కవితా ధురీణుడు. అయిననూ ఆయన మూర్తీభవించిన భక్తి వేదాంత తత్త్వము, విస్రమశీలి భాగవత భాషాశైలిని తన సొంతము చేసుకున్న త్రికరణ శుద్ధిగల అనుష్ఠాన వేదాంతి. సత్ప్రవర్తన, సాహితీ ప్రతిభల సంగమ రూపమే పోతన,

ఉ. పొందవు దుఃఖముల్ భయము పొందదు, పొందదు దైన్యమెమ్మెయిన్
పొందవు తీవ్ర దుర్దశలు పొందు ప్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్ర సౌఖ్యములు పొందు సమున్నత కీర్తులెందు గో
వింద పదారవింద పదపీ పరిబద్ధ గరిష్ఠచిత్తులన్.

(నృసిం. ద్వితీ. 31. ప.)

ఎఱ్ఱన భావుకతకు, అతిసుందరమైన కవితాశయ్యకు, రసపుష్టికి ఈ పద్యమొక మచ్చుతునక.

ఉ. అచ్చపుఁ జీకఁటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరల జర్విత చర్వణులైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన గాసలకు నేగిననైన హరిప్రబోధముల్.

(సప్త - 181 ప.)

ఉ. ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటినూతిలోపలం
ద్రెళ్ళక మీరు నేమనుమతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లి సర్వమున్నతని దివ్య కళామయ మంచు విష్ణువం
దుల్లము చేర్చి రారదవి నుండుట మేలు నిశాచరాగ్రణీ!

(సప్త. 142 ప)

పోతన సహజకవితాధురీణతకు, భక్తివేదాంత మేళనకు పై రెండు ఉదాహరణములైన, ఈ క్రింది పద్యము వినయశీలతకు, నమ్రతకు ఉదాహరణ:

ఆ. భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపఱుతు (ప్రథ. 19 ప.)

4. ఎఱ్ఱన మహా ప్రబంధ కల్పనా కుతూహలాయత్తంబగు చిత్తంబుతో ఒకనాడు ధ్యానమగ్నుడై యుండగా, అతని తాత ఎఱపోత సూరి భావమున నావిర్భవించి 'నా ప్రియదైవమగు అహోబలేశ నరసింహుని అవతారమును స్తుతింపు'మని కోరగా ఈ లక్ష్మీ నరసింహావతార రచనకు ప్రారంభించెను.

ఉ. శ్రీ మదహోబలేశ నరసింహుడు నా ప్రియదైవతంబు, మ
త్స్వామి, తదీయ తీర్థ విభవంబును, దన్మహిమావతారమున్
నీ మధురోక్తి గుంభన మనీషులు మెచ్చగ బ్రస్తుతింపు నీ
కేమియు సంభవించు నఖిలేప్సిత పుణ్య ఫలోదయోన్నతుల్.
(నృసిం. పీఠి. 21 ప.)

పోతన ఒక్క రాకా నిశాకాలంబున సోమోపరాగంబు రాకగని గౌతమీ గంగకుంజని, క్రుంకిలిడి, పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచూ అర్థ నిమీలిత నేత్రుడిగ యున్న తరుణంబున రామభద్రుండు లీలగ కనిపించి- "మన్నామాంకితంబుగ శ్రీ మహా భాగవతంబు దెనుంగు సేయుము. నీకు భవ బంధములు దెగున"ని అనతిచ్చెను.

5. ఎఱ్ఱన నృసింహ పురాణమునందు హిరణ్యకశిపు డొనరించిన ప్రతి హింసా కృత్యము నిరర్థమగుటకు కారణములను తెలిపెను. ఆత్మ నిత్యము, దానికి జనన వృద్ధి క్షయ నాశనము లేవు.

1. న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితాన భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో,

2 న హన్యతే హన్యమానే శరీరే.

3. నైనం ఛిన్దంతి శస్త్రాణి నైనం దహతి...మారుతః

4. వాసాంసి జీర్ణాని యథా విహాయ... అను గీతా శ్లోకముల ద్వారా శ్రీకృష్ణుడు దేహముయొక్కయు లక్షణములను తెలిపెను. దీనిని భాగవత మంగీకరించినది. దేహము శిథిలమగునేకాని ఆత్మ కాదు ప్రహ్లాదుని తండ్రి ప్రహ్లాదుని వార్ధుల ముంచెను, గదల మొత్తించెను, శస్త్రరాజి పొడిపించెను. ఇభేంద్రదపక్తిం రొప్పించెను. కాని ప్రహ్లాదుడు మరణించలేదు. దీనికి కారణము భాగవతము నుడువలేదు. పోతనకూడ హేతువు నిరూపింపకుండుటచేత పాఠకునికి ఆత్మ లక్షణమునకెట్లు పొడమునని సందేహము కలుగును. ఎట్టిన ఇట్టి అనుమానము కలుగకుండ పై విధముగ నిరూపించెను. కథకాని, కావ్యముగాని రచనావిధానమందు పాఠకున కనుమానము కలిగింపగూడదు. ఈ లోపములు పరిశీలించినచో భాగవతమునందు కనిపించును. కాని పోతనగారి కవితా మాధుర్యములో స్థూల దృష్టికవి కనిపించవు.

6. ఎట్టిన సాంఖ్య యోగము తెలిసినవాడు, మరి పోతన భక్తియోగము నెరిగినవాడు.

7. అద్వేష్టా సర్వభూతానాం మైత్రీ కరుణ ఏవచ
నిర్మమో నిరంహకార స్సమ దుఃఖసుఖఃక్షమా
అనికేతస్థిర మతిః భక్తిమాన్ మే ప్రయోనరః॥ (గీత)

ఎట్టిన కన్న పోతనలో వేదాంత తత్త్వము అధికము.

'ఎల్ల శరీర ధారులకు నిల్లను చీకటి నూతిలోపలం...'అను పద్యములో ఇల్లు అను శబ్దమునకు సంసారము అను లక్షణార్థము చెప్పుకొనవచ్చును. సంసారము చీకటి కూపము. అందు ప్రవేశించినవారికి అహంకార మమకారాదులు, అరిషడ్వర్గములు అను అంధకారము వలన పరతత్త్వమును గురించిన జ్ఞానమనెడు వెలుగు కనిపించదు. అందువలన 'నేను, నా వాడు, పరుడు' అను భేదబుద్ధి కలుగును. 'విష్ణుమయం' - అను భావన కలుగదు. కాబట్టి నిరంతరము హరియందు మనస్సును జేర్చి సంసారమున చిక్కుపడక ఏకాకియై ఉండుట శ్రేష్ఠమని చెప్పుదురు. సర్వభూతములయందు సమభావనతో, నిరహంకారుడై, సుఖ దుఃఖములను సమానముగా గ్రహించు స్థిర బుద్ధి గలవాడు

నాకు ఇష్టదని శ్రీకృష్ణ పరమాత్మ గీతలో చెప్పెను. ఇటువంటి వర్ణనలు ఎఱ్ఱన కంటె పోతన రచనలో ఎక్కువగా కనిపించును.

8. భాగవతములో హిరణ్యకశిపుని భార్య పేరు లీలావతిగ ఉన్నది. కాని ఎఱ్ఱన ఆ పేరును స్వీకరించలేదు. ఎఱ్ఱన ఆమెను విశేషముగ వర్ణించెను. పోతన ప్రత్యేకముగ వర్ణించలేదు.

9. హిరణ్యకశిపుడు తపము జేయు తరుణమున, ఇంద్రుడు అతని భార్యను జెఱ పట్టుట, నారదమౌని ఆశ్రమములో ఆశ్రయప్రాప్తి, నారదోపదేశము, శిశువుకు గర్భమునందు ఉండగనే హరిభక్తి ప్రాప్తి - సంస్కృత భాగవతములోనూ, పోతన భాగవతములోనూ ఉన్నవి కాని ఎఱ్ఱన ప్రహ్లాద చరిత్రములో లేవు.

10. ఎఱ్ఱన తన కృతికి, తానుగన్న కలననుసరించి నామకరణము చేసెను. పేరు నృసింహ పురాణమైననూ, పురాణ లక్షణములు ఈ గ్రంథములో లేవు. బ్రహ్మాండ, విష్ణు పురాణములనుండి కథా వస్తువు గ్రహించబడి, విస్తృత పరచబడెను. పోతన భాగవతమని నామకరణ మిడుటచే భగవంతుని సంబధీకులు, భగవతా భక్తుల మొదలగువారి గాథలు ఇందులో ఎన్నో వచ్చినవి. అందులో ప్రహ్లాద చరిత్ర ఒకటి.

11. 'ఎఱ్ఱన తన నృసింహ పురాణములో ప్రహ్లాద చరిత్రయంతయు వర్ణించలేదు.' —ఆంధ్ర సాహిత్య చరిత్ర, పింగళి లక్ష్మీకాంతము.

నృసింహావతారమును, ప్రహ్లాద రక్షణమునకు ఆవశ్యకతమైనంత ప్రహ్లాద చరిత్ర మాత్రమే కలదు. కావున నృసింహ అవతారమే ప్రహ్లాద చరిత్ర కంటే ఇందు ముఖ్యమని మనకు తెలియుచున్నది. ఆ కారణముచేతనే ఈ గ్రంథమునకు కవి 'నృసింహావతార పురాణ కథ' అని పేరిడినాడు.

పోతన అటులగాక, ప్రహ్లాదుని చరిత్ర వర్ణనలో భాగవతుడైన ప్రహ్లాదుని విశిష్ట చరితమును, ఆదర్శమయిన జీవన సరళిని మన ముందుంచినాడు.

12. రామాయణ హరి వంశములను రచించి ప్రబంధ పరమేశ్వర బిరుదమును సంపాదించుకున్న శంభుదాసుడు తన బిరుదమును అధిక్షేపణలకు, ఆక్షేపణలకు అవకాశము లేనిరీతిగా, తన గ్రంథమునకు నృసింహావతార కథ

అని పేరు పెట్టెను. ప్రహ్లాద చరిత్రమనిగాని నృసింహ పురాణమనిగాని నామకరణము జేయలేదు.

వివిధములగు భావములకు కేంద్రముగ పాత్రను ప్రత్యక్షమొనరించుట పోతన ప్రత్యేకత. పోతన భాగవత లక్షణ వర్ణనల కెక్కువ ప్రాధాన్యత నిచ్చి తన విశిష్టతను చాటుకొనినాడు.

19. ఎఱ్ఱన గ్రంథములో కావ్య పద్ధతి ప్రకారము క్షీరవారాశి నడుమ శ్వేత ద్వీపమునందలి వైకుంఠపుర వర్ణనతో ప్రారంభమయి, జయ విజయుల శాపము కలదు. భాగవతములో హరి వరాహావతారము, హిరణ్యాక్ష సంహారము, హిరణ్యకశిపుడు హరిపై పగబూనుట మొదలగునవి కలవు. కాని ఇవ్విధమున పగబూనుట నృసింహ పురాణమున లేదు. 'ఏను జగములెల్ల నేలువాడ'నని తలచి, దానికి తపము సాధనము అని యూహించి, బ్రహ్మకై తపము జేసినాడు హిరణ్యకశిపుడు. అంతమాత్రముచేత ప్రత్యేకించి హరితోడి వైరము పూనుటకు ఇది కారణము కాజాలదు. తాను పరమేశ్వరుడని తలచుట, తనకంటె విష్ణువు లేడని భావించవచ్చును. కాని ప్రత్యక్షముగా హరిని చంపవలెనను కోరికకు కూడ అది కారణము కాజాలదు. భాగవతమునందు తన తమ్ముడగు హిరణ్యాక్షుని చంపిన కారణమున హిరణ్యకశిపుడు విష్ణువుపై వైరము బూనెననుట సమంజసము. అందుమూలమున జయవిజయుల శాప వృత్తాంతము పూర్వ కథతోడి సంబంధము కలిగి ఉన్నది. అది కారణ కార్యభావపు పొందు కలిగి తరువాత కథకు (ప్రహ్లాద చరిత్ర) బీజరూపముగా పరిణమించినది. కావున ఎఱ్ఱన నృసింహ పురాణము కంటె భాగవతములోని కథ అల్లిక పూర్వాపర సందర్భమునకు సంబంధము కలిగి ఉన్నది. నృసింహ పురాణమంతయు చదివి నచో, హిరణ్యకశిపునకు విష్ణువును గురించిన పరిజ్ఞానము ఉన్నట్లు తోచదు. వానిలో క్రౌర్యము తప్ప ఇంకొకటి కానరాదు.

పోతన భాగవతములో హిరణ్యకశిపునికి విష్ణువుగురించిన జ్ఞానమున్నట్లుగా వర్ణించబడినది.

1. వనముల నుండు జొచ్చు, ముని వర్గములోపల సంచరించు, సం
జనన మెఱుంగ రెవ్వరును జాడయొకింత లేదు తన్నుడా
సిన మతి రాయు, వెంటబడి చిక్కక చిక్కడు వీని నొక్క కీ
లున మనమెల్లలోబడక లోబడ బట్టుకొనంగ వచ్చునే. (సప్త. 8.)

2. ......విష్ణుడనంగ నన్యుఁడొక్కఁడు లేడు
యజ్ఞంబు వేదంబు నతఁడె,
భూదేవి క్రియాది మూల మతఁడు,
దేవర్షి పిత్రాది లోకములకు ధర్మాదులకు
మహాధార మతఁడె.

యేస్థలంబుల గోభూసురేంద్ర వేద
వర్ణ ధర్మాశ్రమంబులు వరుసనుండు
నాస్థలంబున కెల్ల మీరరిగి చెఱిచి
దగ్ధములు సేసి రండు మీ దర్పమొప్ప. (న పు. 84 ప.)

ఈ రెండు పద్యములలో జాతీయమగు పదములలో గంభీరమగు అర్థమున్నది. విష్ణువు ఆది మధ్యాంత విరహితుడనియు, రూపము లేనివాడనియు, తన భక్తులతో కలిసి యుండుననియు, నిరంతర మాతని ననుసరించి సేవించు వారికి వశుండననియు, మనమాతని యనుచరులము కాకుండ, మనకు బట్టు పడుట అసాధ్యమనియు, విష్ణు తత్త్వమును, గుణరూపములను హిరణ్యకశిపుడు బోధించెను.

**14.** ఎఱ్ఱన రాజాస్థానము నందున్నవాడు. ఆయన చూపు సామాన్య మానవస్థాయి నతిక్రమించి ఉన్నత పదమున సంచారము చేసినది. దాని ననుసరించియే ఆయన రచనలున్నవి.

పోతన సామాన్య మానవ సమాజములోనివాడు వాని దృష్టి ప్రజా సామాన్యము నతిక్రమించలేదు కనుకనే ఆయనే కవితలో జాతీయములు, వ్యవహారికములు అసంఖ్యాకముగా ఉన్నవి పోతన నిరుపేదగా పర్ణశాలలో నివసించి, కృషీవలుడైన కర్మయోగిగా పొలము దున్నుకొని బ్రతికిన రైతుబిడ్డ.

15 నృసింహ పురాణమునందు ఎఱ్ఱాప్రగడ హిరణ్యకశిపుని విష్ణు తత్త్వమును గాని విష్ణువును గాని ఎరుగని రజోగుణముగల క్రూరునిగా చిత్రించుటచేత, కథ ఆంతర్యము చెడినది. "పగవాడైనను మదీయగుణధ్యాన విధేయధీపరిణతుండైయున్న నేనాతని నిత్యుగా జేతునన్న భగవంతుని కథనమున అనుకూలముగా నృసింహపురాణము లేదు. ఎఱ్ఱన యీ తత్త్వమును హిరణ్యకశిపునందు చిత్రింపలేదు.

'సురలసంగర ప్రముఖ్యులకోలె దీవ్ర దండనమున జంపియేనతగ, చక్కగ నేలుదు లోకమంతయున్' అని తలచి త్రిలోకధిపత్యముకొరకు తపము గావించె. నృసింహపురాణమున కథకు హిరణ్యకశిపుడు ప్రతినాయకుడు. నిజ భక్తుడైన ప్రహ్లాదుని సంరక్షించుటకొరకుమాత్రమే శ్రీహరి నరసింహావతారము ధరించెను.

'అలుకనైన చెలిమినైన దలగి తలప నఖిలాత్ముండగు హరి జేరవచ్చు'

1. అలుకనైన జెలిమినైన గామంబున
నైన బాంధమున నైన భీతి
నైన దగిలి తలప నఖిలాత్ముడగు హరి
జేరవచ్చు వేఱు సేయడతడు (స ప్త. 14. ప.)

2 కీటకము దెచ్చి భ్రమరము
పాటవమున సంభ్రమింప భ్రాంతంబై త
త్కీటకము భ్రమరరూపము
బాటించి వహించుగాదె భయయోగమునన్. (స ప్త. 16 ప.)

ఈ వచనమును ప్రత్యక్షరతత్వ పరిజ్ఞాతయయి యున్నటుల బీరు పోసియకుండ హిరణ్యకశిప ప్రహ్లాద పాత్రలను పోషించి బీజానుగుణమగు కథా వృక్షమును రసాసారంబుగా వృద్ధిని పొందించినవాడు పోతన. భాగవతము పోతన చేతిలోపడి ప్రయోజనము కలదయ్యెను.

16. నృసింహపురాణము కంటె పోతన ప్రహ్లాద చరిత్రము ఎక్కువగా పరతత్వబోధనము చేసినది.

17. ఎఱ్ఱనగారి ప్రహ్లాదుడు ఒక్కొక్క చోట తండ్రిని చూచి యల్లన నవ్విన సంవర్భములు కలవు.

కాని పోతన గారి ప్రహ్లాదుడు ఎప్పుడూ తండ్రికి మెల్లగనే సమాధానం చెప్పుట మనకు గోచరించును. హేళన, అవినయము, అవిధేయత అతనిలో మచ్చుకైననూ లేవు.

18. ఎఱ్ఱన హిరణ్యకశిపుని దేవేరికి కలలో మేఘవర్ణుడు, శంఖ చక్రాద్యాయుధ విలసితుడు, వనమాలా విరాజితుడు పీతాంబరధరుడైన భూదేవు

డొకడు కనిపించి, తన చేతనున్న సంతాన ఫలమునిచ్చి తన నఖములతో గ్రుచ్చి ప్రోయునటుల వర్ణించెను. గురుదేవుని ద్వారా ఆ భూదేవుడు వాసుదేవుడని ఆమెకు తెలిసెను.

పోతన గారి హిరణ్యకశిపుడు కానలలో ఘోర తపంబు చేయ వెడలిపోగా, ఇంద్రుడు వచ్చి చెరబట్టుట, నారదుడు ఆమెను విడిపించుట, తన ఆశ్రమములో ఆశ్రయమిచ్చుట, ప్రహ్లాదజననము మొదలగునవి వర్ణించబడినవి.

19. ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని వధించుటకై తాను విధించిన దండనములకు తోడు కృత్య, శంబర, సమీర, తక్షక, అనలాదులను కూడ నియోగించెను. కాని పోతన తన భాగవతములో వీరి ప్రసక్తి రాసియలేదు.

20. ఎఱ్ఱన కొన్ని వర్ణనలను నిషేధరూపములో వర్ణించెను. ఉదాహరణకు-

వాసుదేవుని పాద వనరుహంబుల భక్తి
తగదను తండ్రియు తండ్రిగాడు,
వేదచోదితమైన విష్ణు ధర్మమునకు
గోపించు గురుడును గురుడు గాడు
భవ దుఃఖములు మాన్ప బంధువైన హరిసేవ
నెడలించు హితుడును హితుడుగాడు
పరయోగ మతమగు వైష్ణవ జ్ఞానంబు
వదలిన చదువును జదువుగాదు

కేశవాకార లీలలు గీలుకొని, ము
దంబు నొందని తలపును తలపుగాదు
మాధవస్తోత్ర ఘనసుధా మధుర రుచుల
జిలుక కుండెడు జిహ్వయు జిహ్వగాదు.

దీనిని దృష్టియందుంచుకొనినను, పోతన ప్రత్యక్షముగా చెప్పిన విధము:

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకుని చూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయిని మ్రొక్కు శిరము శిరము

విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
　　మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
　　పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

తే. దేవ దేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడు గురుడు గురుడు
తండ్రి! హరి జేరుమనెడి తండ్రి తండ్రి!

21. ఎఱ్ఱన ప్రహ్లాదుని నామకరణ చౌలమంజీ బంధనములు వర్ణించగా, పోతన ప్రహ్లాదుని పేరును హరితోనే దేవతలకు చెప్పించెను

22. ఎఱ్ఱనగారి హిరణ్యకశిపుడు మదిరాపానప్రియుడు, అనేక విలాసినీ పరివృతుడు. కాని పోతన వర్ణించిన హిరణ్యకశిపుడు కేవలము **పరపీడా పరాయణుడు.**

23. ప్రహ్లాదుని ఉపదేశములతో కూడ ఎఱ్ఱనగారిచే వర్ణించబడిన అతని సహాధ్యాయుల చిత్తము మారలేదు. కాని పోతనగారి ప్రహ్లాదుని వాగ్వైభవము, హరి మహిమా ప్రభావములకు ఆతని సహాధ్యాయుల చిత్తము మారిపోయెను.

24. ఎఱ్ఱనగారి ప్రహ్లాదుడు గురువులకే ఉపదేశము చేయునంతటి ఎత్తున కెదిగినవాడు. కాని పోతనగారి ప్రహ్లాదుడు కేవలము తన స్థితిని వినయముగా ఎఱిగించినవాడు.

**ఎఱ్ఱన :**

సీ. మనకంటె బెద్దలు ఘనబోధయుతులు ద
క్షాదులునున్ వసిష్ఠాదుల వల
నత్రి పులస్త్యాదులట మఱి వ్యాసులు
　　వెఱ్ఱులె కొలచిరె విష్ణుదేవు
గొందరు ధర్మంబు నోరి భజింపంగ
　　గొందఱర్థము మదిగోరి కొలువ
గొందఱు కామంబుగోరి సేవింపంగ
　　గొందరు మోక్షంబుగోరి తెలియ

గీ. నిందఱకును సేవ్యుఁడేవేల్పొక్క ప
ద్మాక్షుఁ డజుఁ డనంతుఁ డప్రమేయుఁ
డచ్యుతుఁడు పురాణుఁడను నొక్కరుఁడుగాక
వెండి దైవమనఁగ నొండుగలఁడె? (నృసిం. చతు. 100 ప.)

**పోతన :**

తే. ఇనుమయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నావిధమున
గరగుచున్నది దైవయోగమున జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు (భాగ. సప్త. 149 ప)

ఎఱ్ఱనలో పరుషత, ముదిమి ఎక్కువ పోతనలో కోమలత, సౌకుమార్యము మనకు అధికముగా కనిపించును. ఎఱ్ఱన ప్రారంభించిన అంత్య ప్రాస అస్తావిస్తరముగ నుండును. అందమయిన శయ్య కనబడదు. భావమెంత బలమైనదైనను భాష కుంటుపడినచో, రసము సుడులు తిరుగును. పోతన శయ్యా సౌష్ఠవమునకు వన్నెలు తెచ్చినది అంత్యప్రాస. మృదుమనోహరమగు పద గుంఫితమై ఉన్న పోతన పద్యములో పదములు కదిలించుటకు వీలుండదు. కదలించిన పద్యము సడలువారును. ఎఱ్ఱన ఒకటి రెండు దృష్టాంతరములతో తృప్తిపడును కాని పోతన ఒక్క విషయమును అనేక విధములుగా నిరూపించిన గాని తృప్తిపొందడు. ఒక్కొక్కదానియందు ఒక్కొక్క విశేషముండి, అవి యన్నియు ప్రధాన విషయమును నిరూఢము గావించును. స్తంభమునుండి ఆవిర్భవించిన నృసింహుని ఆకార వర్ణనలో ఎఱ్ఱన కంటెను, మూలమున కంటెను కూడ పోతన విష్ణువు యొక్క దివ్య మంగళ రూపము ననుసరించి, "ప్రఫుల్ల పద్మ యుగళ సంకాశ భాస్వర చక్ర చాప హలకులిశ......ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన, భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీరరస సంయుతుండను..."అని వర్ణిస్తాడు ఎఱ్ఱనలో బీభత్స,రౌద్ర,భయానక వర్ణన ఎక్కువపాలుగ నున్నది. హిరణ్యకశిపుని వధించుటలో కూడ ఎఱ్ఱనకంటె పోతన వర్ణన భిన్నముగ ఉన్నది. ఎఱ్ఱన, 'వధఘట్టమును' చాల బీభత్సము, జుగుప్సలమేళనతో వర్ణించినాడు ఎఱ్ఱనగారి ప్రహ్లాదునికంటె పోతనగారి ప్రహ్లాదుడు 'మాయా సౌఖ్యభావంబునన్ సుగతింగానని మూఢులంగని మదిన్ శోకించి' వారికి సుగతిని, సద్బుద్ధిని ప్రసాదించమని గూడ ప్రార్థించెను

# ఎఱ్ఱన, పోతనల వ్యక్తిత్వ,కవితారీతులలో సారూప్యములు

1. ఎఱ్ఱన పోతన లిరువురు 'పుట్టుకవులు', సహజ పాండిత్యశోభితులు. సత్ప్రవర్తన, త్రికరణశుద్ధిగల అనుష్ఠానపరులు. వినయభూషణశోభితులు. శైవమతస్థులైనను విష్ణుభక్తులు. సౌజన్యమూర్తులు. ధర్మైకతత్పరులు. గురువును పరమేశ్వరుడిగా భావించి, సదా ప్రశంసించినవారు. ఇరువురును భక్తకవులు.

**1. సహజ పాండిత్యము - పోతన**

గ. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్రి సహజ పాండిత్య......

**ఎఱ్ఱన**

క. కావున ప్రబంధరచనా
ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం
బై వెలసిన యది...... (నృసి. పీఠి. 20 ప.)

**వినయశీలత**

**2.** ఎఱ్ఱన

కతిపయాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గిక చాపలంబు కతన లక్ష్మి - 1-12.

**పోతన :**

భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మి చూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపరతు (ప్రథమ. 19 ప.)

2. ఎఱ్ఱన పోతన లిరువురూ శ్రీహరి ఆశ్రిత వాత్సల్యమును, భక్త పరాధీనతను, కారుణ్య భావననూ, సర్వవ్యాపకత్వమును, అఘటిత ఘటనా సామర్థ్యమును, అనంత కళ్యాణ గుణగణములను, శాంతిస్థాపనను, దీనులయెడ దయార్ద్ర భావనను, అవక్ర విక్రమ పరాక్రమమును, ధర్మ స్థాపనా ప్రియత్వమును, దుష్టశిక్షణా కర్తవ్యమును చక్కగా వర్ణించిరి. ఇరువురకు ప్రేరణ మానవాతీతుల నుండే లభించినది. ఎఱ్ఱనకు ఆయన స్వర్గస్థుడైన తాత ఇవ్వగా, పోతనకు శ్రీరామచంద్రుడు ఇచ్చెను.

3. ఎఱ్ఱన తన కృతిని 'శ్రీ విభునకు' అంకితమివ్వగా, పోతన హరి కిచ్చెను. లౌకిక సుఖముల నాశించి గాని లేక విలాసములకు లోబడి గాని వీరు ఏ రాజునకూ తమ రచనను అంకితమిడలేదు.

**ఎఱ్ఱన :**

కృతికి విభుండు శ్రీవిభుఁడు, కీర్తన పావనమైన తద్గుణస్తుతి కృతి...
(నృసిం. పీఠి. 28 వచ.)

**పోతన :**

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరమువాసి, కాలుచే
సమ్మెట ప్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.
(భాగ. ప్రథ. 18ప.)

4. ఎఱ్ఱన పోతన లిరువురును ఆ భగవంతుని కోరుకొనినది కేవలము ఆతనిపట్ల నిష్కామ భక్తియే.

**ఎఱ్ఱన :**

ఏ జన్మమున జనించిన
నా జన్మమునందు నీ సమంచిత చరణాం
భోజంబులపై విగత
వ్యాజమయిన భక్తి భక్తవత్సల! యీవే. (నృసిం. పంచ,188 ప.)

**పోతన**

నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును, నితాం
తాపార భూత దయయును
తాపస మందార నాకు దయసేయగదే!

ఇరువురును 'మాయాసౌఖ్య భావంబులన్ సుగతింగానని మూఢులంగని' 'సంసారముపై వేడుకగల' వారిని చూసి వారికి 'మోక్షగరిమను ప్రసాదింప జేయమని' కూడ భగవంతుని ప్రార్థించిరి.

5 నృసింహుడు స్తంభమును ఛేదించుకొని ఆవిర్భవించుకొనుట విష్ణు పురాణములో లేదు ఎఱ్ఱన, పోతన లిరువురును కల్పన చేసి వ్రాసిరి.

6. ఎఱ్ఱన గారి పురాణము, పోతన్న గారి పోతవలన నరసింహావతారము మరియు ప్రహ్లాద చరిత్ర ఆంధ్రదేశమంతటా కాదు, భారతదేశమంతటనూ ప్రసిద్ధి చెందినవి.

7. ఎఱ్ఱన, పోతన కాలమునకు చాలా ముందువాడు. పోతన ఎఱ్రనను కొన్నిచోట్ల అనుకరించినట్లు, మనకు స్పష్టమౌతుంది.

హరి భక్తుల తపము తపము
హరి భక్తుల జపము జపము హరిభక్తుల భా
సుర జన్మము భవసారము
హరి భక్తులు భువన పావనైక విహారుల్. (నృసిం. ద్వితీ-58 ప.)

పోతన:-కమలాక్షు నర్చించు కరములు, కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ...

8. ప్రసాద గుణము :

ఎఱ్ఱన:-నిను సేవించిన గల్గు మానవులకున్ వీటి వధూటీ ఘటీ
ఘన కోటీశ కటీ కటీ తటీ పటీ గందేభ వాటీపటీ
రనటీ హారికటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికా పేటికల్
కనదామ్నాయ మహా తురంగ! శివలింగా! సీల కంఠేశ్వరా!

పోతన:-అంబ! నవాంబు జోజ్జ్వల కరాంబుజ శారదచంద్ర చంద్రి కా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణరత్న దీప్తికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ, భా
వాంబర వీథి విశ్రుత విహారిణి, నన్ గృపజూడు భారతీ!

9. హరిభక్తి గురించి:

**ఎఱ్ఱన**

క. చెడిపోకుడు సంసారము
గడ తేర్పుడు శౌరి చరణ కమలము లెడ్డం
దిడికొను డూరక కాలము
కడపకుడి వివేక వీథి గడగుడు నడవన్. (నృసిం. చతు 74 ప)

ఆ. విషయసక్తులైన విబుధాహితులతోడి
మనకి వలదు ముక్తి మార్గవాంఛ
నాది దేవు విష్ణు నాశ్రయింపుడు ముక్త
సంగజనులఁగూడి శైశవమున. (భాగ. సప్త. 216 ప.

10 ఎఱ్ఱన పోతనలు తమ రచనలలో పాత్రోచితమగు భాషణములను, హృదయమునకు హత్తుకొనెడి శైలితో, భావగాంభీర్యతతో నడిపిరి.

11. భావశబలత, రసపేశలత, రచనా సౌలభ్యము ఎఱ్ఱన పోతనల రచనలలో మనకు గోచరించును.

12. భక్తి మోక్షసిద్ధికి మార్గమని, నిష్కామభక్తిరాజమార్గమని, నిజమైన భక్తుడు సృష్టిలోని అణువణువులో ఆ సర్వాంతర్యామి భగవంతుని దర్శింపగలడని, ఆతనిని దేహబాధలు, లౌకికచింతలు బాధించవని, ఇరువురు ప్రహ్లాదుని చరిత్ర వర్ణించుట ద్వారా ఋజువు చేసిరి. 'విష్ణుమయం జగత్సర్వం' అని వీరిద్దరి అభిప్రాయము.

13. దేహాత్మల లక్షణములు. ఆత్మ పరమాత్మల సంబంధము, భాగవతుని స్వరూపము, జన్మ సాఫల్యతకు మార్గములు ఎఱ్ఱన పోతన లిరువురును వర్ణించిరి.

14. సుఖదుఃఖములు, దూషణ భూషణములు లేక రీతిని పరిగణించుట సాత్త్విక భక్తుల లక్షణమని ఇరువురు కవులును నొక్కి వక్కాణించిరి.

15 ఎఱ్ఱన పోతన లిరువురును దేశీయములగు శిష్ట వ్యావహారికపదములు, నానుడులు, లోకోక్తులను సందర్భోచితముగ పలుచోట్ల నుపయోగించిరి

16. పునర్జన్మ రాహిత్యము, కైవల్యప్రాప్తి - ఈ రెండు మానవ జీవిత లక్ష్యములు కావలెనని ఇరువురును ఘోషించిరి.

17. సగుణ బ్రహ్మను సమాహితంతో సాక్షాత్కరించుకొనటానికి భక్తి వినా మరొక సులభమార్గంలేదని ఎఱ్ఱన పోతనలు నొక్కి వక్కాణించారు.

18. కవిత్వం ఇరువురికి కైవల్య సాధనమైనది. సర్వమానవ హృదయాంతరాళాల్లో భక్తి బీజాలను నాటడమే ఇరువురి లక్ష్యం

## ఎఱ్ఱనలోని ప్రత్యేకతలు :

1. ఎఱ్ఱనకు కబ్బము అల్లుట వెన్నతో పెట్టిన విద్య.
(నృసిం. పీఠ. 20. ప)

2. బహుపురాణములను ధర్మశాస్త్రమును ఎఱిగినవాడు మరియు సకల భాషాకవిత్వ విశారదుడు. (నృసిం. పీఠి. 19 ప. మరియు హరి. పూ. 1-37)

3. ఇతని సౌజన్యము, మునిమూర్ధన్యము, గురువులయెడ గౌరవమపారము. సత్ప్రవర్తన, సౌశీల్యత, సౌమ్యత, ధర్మనిష్ఠ, వినయశీలన ఈతని కాభరణములు.

4. కొందరు విమర్శకులు భావించినట్లు ఎఱ్ఱన 'అష్టరసవాది' కాదనియే చెప్పవచ్చును.

5. ఎఱ్ఱన భావనా విహంగము నడుమ నడుమ మూలాధారము నుండి సహస్రారమునకును, భూమినుండి స్వర్గమునకును ఎగురుట యీ వర్ణనము లందు మనకు గోచరించును. జన్మతః కవియైన ఎఱ్ఱన కవితాశయ్య పుష్ప గుంఫితము, సహృదయరంజకము.

క. సనకుడు సనందనుండును
సనత్కుమారుడు సనత్సుజాతుండనగా
మునివరులు వనజభవునం,
దను తేతెంచిరి ముకుంద దర్శనవాంఛన్. (నృసిం. ద్వితీ-82)

అర్థమున కనుకూలముగా ఛందస్సు పరుగిడుననుటకు ఇది ఉదాహరణము.

6. ఎఱ్ఱనది సాంఖ్యయోగ విధానము.

శా. దృష్టాదృష్టఫల స్పృహావిముఖులై దిక్పూర్వ తత్త్వక్రియా
సృష్టిం బ్రస్ఫుట తీవ్ర ప్రబోధమున నుత్సేకించి యవ్యక్త సం
సృష్టిం బాసి నిరస్త వైకృతు నుదాసీనాత్మ షడ్వింశ వి
స్పష్టేశ్వరుని నిన్ను సాంఖ్యు లెలమిన్ భావింతు రాత్మేశ్వరా!

7. ఎఱ్ఱనకు పరమేశ్వరుని యెడగల అభిజ్ఞత ఎలత లోతో అంత విరివి.

8. చంద్రవర్ణనలో ఎఱ్ఱనవలె గొప్ప ఎత్తులకు ఎవరు ఎక్కలేదేమో!
(ఆరుద్ర)

వెన్నెలవెల్లి పాల్కడలి వేడ్కడనంబున చేర్చి దిక్కులన్
మిన్నును ముంపనందు రజనీకరబింబము కుండలీ భవ
త్పన్నగతల్ప కల్పనము భంగి దనర్చె దదంతరమునన్
వెన్నుని భంగి, జాడ్కులకు వేడ్క యొనర్చె గలంకమ త్తరిన్.
(నృసిం. 3-87)

9. శంభుదాసుడని పేరున్నను విష్ణుని వర్ణించు వేళ ప్రహ్లాదుని వలె పరవశించి ఒడలు మరచిపోవును. అకారంతో మొదలయ్యే ఏదైన మాటతో ఒకసారి విష్ణువును పేర్కొన్నచో, పద్యంలో చోటున్నంత వరకు అకారం విడచిపెట్టడు. ఉదా:- అభవ, అక్షయ, అప్రమేయ అని అంటాడు. ఆదిదేవు డంబుజాక్షుడక్షయుండు (5-375).

10. ఎఱ్ఱనగారికి 'స్ఫురత్' అనుమాట చాల ప్రీతికరమైనది. 'స్ఫురద రుణాంశరాగరుచి సూరెల బర్వగ' (1-73), భారతం అరణ్య పర్వశేషంలో కూడ స్ఫురదరుణాంశరాగరుచి...

11. 'విజ్ఞానం' అన్న శబ్దమూ ఎఱ్ఱనగారికి ఇష్టమే. నృసింహపురాణాన్ని విజ్ఞానాత్మక వాఙ్మయం (పీఠి - 26) అన్నారాయన. తపము చేయుచున్న హిరణ్యకశిపుడు నిశ్చలకళా విజ్ఞాన సర్వస్వమో అన్నట్లు (2-86). పడికట్టు సమాస పదములుకూడ ఈయన అధిక సంఖ్యలో ప్రయోగించినాడు. ఉదా : మందస్మిత సుందర వదనారవిందుడు, అమందానంద కందళిత హృదయార విందుడు.

12. నృసింహ పురాణములో సమకాలిక విషయములు కొన్ని వర్ణించ బడినవి. స్వర్గములో కూడ రాజాస్థానములలో ఉన్నట్లు బిశ్వ బంట్రోతులు ఉండి అట్టహాసం చేస్తున్నారట. (నృసిం. 1-80 ప.)

13. నృసింహ పురాణములో, అడవిగాచిన వెన్నెలలు (2-90) బల వంతపు వెఱ్ఱి (5-74) చప్పిటి నోరు (4-178) చెవిటి కూదిన శంఖు విధమున (2-90) తామరపాకున నీరు వోలె (5-29) తోడునీడ (2-40), నిప్పునం జెదలంటునె (4-32) మూడేండ్ల లేని సద్బుద్ధి ముప్పదేండ్ల లేదు. (3-151)

14. మేడమీదెదలెడు, (4-162) ఆత్మవిద్యకు నాదవదౌడగినాడ, వంటి తారక విశేషములు, మెచ్చక యెదురైన మృత్యువు పెడదొక్కి, క్రొవ్వాడి, కోటలు త్రెవ్వదాఁచిహరి పూ. (4-155) వంటి స్వసంవాదములు మనకు ఈయన రచనలో కనిపించును.

15. తనను క్రౌంచపక్షిగా, తన పూర్వకవులు రాయంచలుగా వర్ణించి, వారితో కీర్తిసంగ సుఖలీలను కాంక్షచేసితినని చెప్పుకొనిన వినయశీలి ఎఱ్ఱన.

16. భాషా సౌందర్యము ఈతని కవితకు ప్రాణము :-

మ. రండు పోదము లెండు వేగమ ప్రస్ఫురత్కుఠారాయుధా
ఖండ ఖేలన హేతి భీతి నగప్రజాభయ దాయితా... 2-145

17. ఎఱ్ఱన రచనతో స్వభావోక్తులు ఉత్ప్రేక్షనే మరపించినవి :

పగళు వెలతోటనీడలు బ్రాతియయ్యెఁ
బగళులును రేలు తనుగాలు బ్రాఁతి యయ్యె
రేలు వెన్నెల బయళులు ప్రియములయ్యె
రేలు బగళులు నిద్రలుఁ బ్రియములయ్యె 3-78

18. ఒక గుడ్డు మురిగిపోనేమి యగున్? (4-25) నిప్పున చెదలంటునే? (4-52) కుంపటిలో దామర మొలచిన క్రియ వంటి నానుడ్లు, నాలుకాడునే, (2-28) వాడు నాకు, వానికిఁగలనేను, (3-56) చేతఉచికాంచు (4-170) వంటి జాతీయములను, ఇంత మాత్రమునకు (1-93) కనినకంటె (3-188) ఏల కలుగడు (2-30) వంటి ప్రయోగ విశేషములు వాడినను, ఏను దియ్యమున సడించిన (2-56) అదియు మహామయు......ఎఱుగం - 3. గాదరముగాదు. (1-39) వంటి దోషాభాసములు,

పొగడ ప్రాకు మొదళ్ళను బుష్పరసము
దొరగి నెత్తాయి యందును నెరయ నొప్పె
బూచు కొరకు నైమున్న యిపులు దలిర్పఁ
గడగి వనలక్ష్మి యమిసిన కళ్ళయనగ (2-69)

వంటి న్యూనోపమానములను ఉపయోగించెను.

19. అట్టి క్రూరమునకు నట్టి ఘోరమునకు, (4-121) ససుమహత్-(అరణ్య - 5866, 6-1) సుమహదుపనిషత్ ప్రస్తుత్యభిక్రావ్యసేవ్యా' (మహాప్రస్థాన) 1-79 అను తిక్కన ప్రయోగములను తలపునకు తెచ్చెను.

20. ఎన్నోవర్ణనలలో ఎఱ్ఱన పోతనకు అన్నయని, మార్గదర్శి యని మనకు స్పష్టమగును.

సీ. ఆ. అంబుజోదర ధ్యాత......(లక్ష్మి - 8-147)

సీ. గీ. అంబుజోదర పాదార - (భాగ - 7-122, 150)

## పోతనలోని ప్రత్యేకతలు

1. పోతన మూర్తీభవించిన భక్తి వేదాంత తత్త్వం. భగవద్భక్తికి గుండెలో వెన్నెల కోవెల నిర్మించుకొని భాగవత కృతి వ్రాసిన ధన్యజీవి. కొందఱకు తెలుగు, కొందఱకు సంస్కృతము, కొందఱుకు రెండు ప్రీతియని నేను ఆయాచోట్ల ఆయా భాషలను వాడి అందఱను మెప్పింతునని చెప్పి, అటులనే చేసి చూపిన ప్రతిభాశాలి.

2. తన రచనా వైభవంతో సాహితీప్రియంభావుకులైన సహృదయులను మరియు సాధారణ ప్రజానీకంలోని నిరక్షరకుక్షుల్ని సయితం ఉర్రూత లూగించిన ప్రజ్ఞాశాలి. అతని కవిత్వం రసవత్కవిత్వ బంధురమేకాక, భక్తితత్త్వ ప్రబోధకము కూడ.

3. దైవ దత్తమూ, ఆజన్మ సిద్ధమూ అయిన కవితను పరిశ్రమతో రాణింపజేసి, ప్రజంకోసం వినియోగించిన సహజ పాండిత్య సంశోభితుడు పోతన.

4. ఛందో మాధుర్యం పోతన కవితలో విరాట్ స్వరూపం ధరించింది. కవితలో భావ, భాషకు అతీతములైన అలంకారములూ, అలంకారముల కతీతమైన ఛందస్సూ, ఛందస్సున కతీతమైన నాదబిందు కళోపాసన సూక్ష్మదృష్టికి అభివ్యక్తాలు. ఇవన్నీ పోతనలో మనం చూడవచ్చును

1. భాగవతము తెలిసిపలుకుట చిత్రమ్ము
శూలికైన తమ్మి చూలికైన...

2. హారికి, నందగోకుల విహారికి, దైత్య సంహారికి...

3. పూరించెన్ హరి పాంచజన్యము...

4. మానినులీడురాదు...దీనమానసగ్లానికి...

అన్న పద్యాలు పై మాటలకు ఉదాహరణలు.

5. 'వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే'...అన్న ఉక్తి ననుస రించి ఉత్తమ వాక్ మరియు అర్థ సమ్మేళనం పోతన కవితలో మనకు దర్శన మిస్తుంది.

6. పోతన కవితకు విశిష్టత చేకూర్చినది భాగవత భాషాశైలి. తెనుగు నుడికారపు సొంపులు వంపులు, ఈయన కవితలో తామర తంపరలు.

ఉదా : 1) సిగ్గుపడుట గల్గి - సింగారమును గల్గి
భక్తిగల్గి చాల భయముగల్గి
నయము ప్రియము గల్గి నరనాధు చిత్తంబు
సీత తనకు వశము చేసుకొనియె.

2) ఇందుగల డందులేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు దానవాగ్రణి! వింటే.

7. పోతన అంతరాత్మలో తరంగితమయ్యే భక్తి భావలహరి కవితా స్రవంతిగా అతని నాలుకపై తురంగలించి పద్య తరంగాలుగా భాగవతంలో ప్రవహించింది.

8. కవితకు లలితశబ్ద సంయోజనం, మధురాక్షర పునరావృత్తి, అను ప్రాస యమకాది శబ్దాలంకార సంవిధానం, ధార, రాగరంజిత శైలి ప్రాణాలు. వీటివల్ల సంకీర్తనకు సౌలభ్యం ఏర్పడుతుంది భావనాగాంభీర్యం, ఆలోచనా మృతం వర్షించే సార్థక పదప్రయోగం, వ్యంగ్య సౌరభాన్ని వెదజల్లే వాక్య

విన్యాసం, సరళీకృత మొనర్చబడిన తాత్త్వికచింతన పఠితలను ఆలోచింప చేస్తాయి. ఇవన్నీ పోతన కవిత్వంలో కోకొల్లలు. వృత్త్యనుప్రాసం పఠితలను మైమరిపింపచేసే సమ్మోహనమంత్రం. దీర్ఘ సంస్కృత సమాసములు కూడా మందారమకరంద ప్రవాహంలో పోతన కవితలో జాలువారుతూ ఉంటాయి.

1) అమ్మలగన్నయమ్మ...... 2) శారదనీరదేందుఘనసార...... మచ్చుకు కొన్ని ఉదాహరణలు.

9. పోతన జీవితం ఉత్తమ మానవతకు ఉజ్జ్వల మణిదర్పణం. భక్తితో పాటు భూతదయయు వేడుకున్నాడాయన (నీ పాదకమల సేవయు, - నీ పాదార్చకులతోడి నెయ్యము, నితాంతాపారభూత దయయును, దాపస మందార నాకు దయసేయగదే!)

10. పోతన కవితలో బొమ్మలున్నాయి, అక్షరాలతో అమర్చబడిన శిల్పాలున్నాయి, ఉక్తి వైచిత్రులవలన వ్యక్తమయ్యే చమత్కారాలున్నాయి, తెలుగుదనం తొలకరించే తియ్యని అందాలున్నాయి, సాధారణ ప్రజల నోళ్ళలో కదలాడే నానుడులు, జాతీయపదాలున్నాయి సాహిత్యపు పోకడలు కుంటుపడ నీయకుండ పోతన భాగవతమును తెనిగించినందులకే అది సర్వమానవ ఆదరణ పొందినది. (సి. నారాయణ రెడ్డి)

11. కథావస్తువును మించిపోని వర్ణన, పోతన కవితాశక్తికి దర్పణం.

12 పద్యము నెత్తుగడ యందును, దింపుగడయందును గంభీరత, యతిప్రాసలకు తడుముకొననిశక్తి అనర్గళధార, కుదింపులు, మదింపులు లేని అమరిక, అద్భుతమైన బిగిబిగువులు, అసాధారణ పదలాలిత్యము, వ్యావహారిక శైలి, పాత్ర పోషణలో దూరాలోచన, పోతన కవితా విశేషములు. ఆట వెలదులు రచించుటలో జాణ అయిన పోతన రసవంతమైన ఇతర ఛందోరీతుల ననుసరించికూడ పఠితలను ఉఱ్ఱూతలూగించగలిగినాడు. ఎఱ్ఱనలో ప్రతిభ లేదని కాదు. పోతన, ఎఱ్ఱన పద్యమునకు నకలు తీసినను మూలము కంటె నకలులో అందమున్నది.

13 ఎట్లన ప్రారంభించిన అంత్యప్రాస అస్థావిస్తమయినది పద్యమునకు శయ్య ప్రధానము భావమెంత బాగున్నను నడకలో కుంటుపడకూడదు. పోతన శయ్యా సౌష్ఠవములకు వన్నెలు కూర్చినది అంత్యప్రాస.

14. పోతన ఒక దృష్టాంతము చెప్పి ఊరకుండు స్వభావము కలవాడు కాడు. ఒక్క విషయమును బహువిధములుగా నిరూపించిన గాని మనస్సు తృప్తి పొందదు. ఒక్కొక్క దానియందు ఒక్కొక్క విశేషముండును. ఆ విశేషములన్నియు ప్రధాన విషయమును నిరూఢము గావించును.

15. పరమ భక్తులలో ప్రథమ స్థాన మలంకరించిన భక్తశేఖరుడు ప్రహ్లాదుడు. తన శాంతరసప్రభావము చేతనే దుర్భరకష్టసముద్రము దాట గలిగినాడు. ఫలితముగా శాంతిమయ జీవనుడై జీవన్ముక్తుడు కాగల్గినాడు. ఇది నిరూపించుటే పోతన లక్ష్యము.

16. ఎట్లన, హిరణ్యకశిపుడు వరములు పొంది వచ్చిన తరువాతనే లీలావతికి నెల తప్పినట్లు చెప్పెను. ప్రహ్లాదుని జననము, చౌలోపనయనాదులు విద్యాభ్యాసము వర్ణించెను కాని పోతన, ఈ విషయములో కొన్ని సందేహము లకు తావిచ్చెను హిరణ్యకశిపుడు తపస్సు చేసిన సమయము, ప్రహ్లాదుని వయసు, విద్యాభ్యాసము కాలము మొదలగునవి పరస్పర విరుద్ధములైనను కథా గమనములో ఆటంకము కలిగింపవు.

17. హరిద్వేషము హరిభక్తికంటె ఎత్తయినదని, హిరణ్యకశిపుని పాత్ర ద్వారా పోతన ఋజువు చేసినాడు.

18. కంద పద్యముల నడిపించుటలో కూడ పోతనది అందెవేసిన చేయి.

క. చదువని వాడజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత కలుగున్
జదువగ వలయును జనులకు
జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ!

ప్రహ్లాద చరిత్రలో ఒక అంతరార్థమున్నది. "హిరణ్యకశిపతీతి హిరణ్యకశిపః" హిరణ్య మనగా బంగారము. అది కనులయందు కలవాడు హిరణ్యాక్షుడు. అనగా బంగారమును చూచుకొని ఆనందించువాడు. ఉన్నది తానను భవించడు, పరుల కీయడు. ఆతడు లోభి. రెండవవాడు బంగారము తినువాడు. హిరణ్యాక్షుడు తుదకు వరాహము చేత చిక్కి చచ్చెను. వరాహము నీచమగు జంతువు అట్లే లోభి నీచమగు మరణము పొందును. సుఖభోగి తనివొంద సుఖము లొందును. ఆహ్లాదము నొందును. ఆ యాహ్లాదము ప్రకృష్టమైనది. కావున ప్రహ్లాదము. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు జన్మించెననుటలో అర్థమిది. ఆ యాహ్లాదము హరి భక్తితో కలిసి, నానాటికి అభివృద్ధి చెందును. అదియే కామిగాని మోక్షకామి కాడనుట. ఆ హరిభక్తి యంతకు పెరిగి, యత్యధికమై, లౌకిక భోగమందిచ్ఛ నడగించును. అది హరి హిరణ్యకశిపుని నిర్జించెననుట లోని భావము. హిరణ్యకశిపుడు ఇంద్రియ సుఖములకు చిహ్నము. అది నిర్జించ బడి, అనగా విషయేచ్ఛలయందు రక్తి వీడి, విరక్తి కలుగును. అప్పుడు హరి భక్తియుతమగు నాహ్లాదము మిగులును. ఇది మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యుల వారి కథనానికి సారాంశము.

ఆంధ్రుల పురాకృత పుణ్యఫలములే ఎఱ్ఱన, పోతనలు. వీరు తమ ప్రతిభా పాండిత్యములచే ప్రహ్లాదుని చరిత్రమును ఇంటింటా ఖ్యాపింపచేసిన కారణజన్ములు. తమకు దైవదత్తమయిన కావ్యకళను పారమార్థిక ప్రయోజన మునకై పదుగురి మేలుగోరి నిష్కామబుద్ధితో ఉపయోగించిన ధన్యజీవులు వీరు. మోక్షసాధనోపాయములను, ఆత్మ పరమాత్మల సంబంధమును, శరణాగతి వైభవమును, భాగవత లక్షణములను, లౌకిక విషయములలోని నిస్సారతను, పరమాత్మ సర్వవ్యాపకత్వమును, భక్తిలోని విశేషతత్త్వమును పండిత పామర రంజకమైన శైలిలో రచించిన మహానుభావులు ఎఱ్ఱన, పోతనలు. భూతదయను, అహింసా ప్రవృత్తిని, సాత్త్వికగుణ వైభవమును విశేషముగా వివరించిన మానవతామూర్తులు.

ప్రహ్లాదుని పాత్రద్వారా పరమాత్మ ఆశ్రిత వాత్సల్యమును, కృపాగముణను, ధర్మసంస్థాపనా లక్ష్యమును మరొక్కసారి చాటిచెప్పిన నిజమైన భాగవతులు ఎఱ్ఱన, పోతనలు. ఆంధ్రమాత నోముల పంటలైన వీరిరువు రచనలు తెలుగువారికి తరగని సిరులు. ప్రహ్లాదుని చరిత్ర వర్ణించి, ఎఱ్ఱ పోతనలు, ఎఱ్ఱన పోతనల ద్వారా వర్ణించబడ్డ ప్రహ్లాదుడు ఆచంద్రార్కమ నిలచిపోగల మహితాత్ములైనారు.

ఎఱ్ఱన్న ధగధగలు, పోతన్న నిగనిగలు
తెలుగు నాటను జిమ్మ నిరతమ్ము వెలుగులు
భక్త ప్రహ్లాదుని, భవ్యమౌ చరితమ్ము
భక్తి కోటికి జూపు ఘనమైన మార్గమ్ము.

